# "ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ, ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక, సరదాగా యిది చెయ్యాలింక"

— ఫెవీ ఫెయిరీ

MON TUE WED THU FRI SAT

APRIL
TUE
2

"ఇంద్రజాలం కానే కాదిది
చేత్తోచేసే తమాషా యిది
డబ్బుతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిదొవిప్పి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపోండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ పర్సయినా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మలైనా చేసెయ్యింక"

'ఫెవీ టార్టాయిస్' (తాబేలు) ఎలా తయారుచెయ్యాలో అనే తీరుని ఉచితంగా పొందటం కోసం యీ కూపన్‌ను పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి:
"ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020

'ఫెవీ టార్టాయిస్' (తాబేలు) ఎలా తయారుచెయ్యాలో అనే తీరుని ఉచితంగా పొందటం కోసం కూపన్‌ని "ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ బొంబాయి 400 020 చిరునామాకు పోస్టు చెయ్యండి.

పేరు ____________________

వయస్సు ____________________

చిరునామా ____________________

____________________

నగరం ____________________

రాష్ట్రం __________ పిన్ __________

మీకు మా ఉచిత 'ఫెవీ క్రాఫ్ట్' అందిందా : అవును/కాదు (C)

## ఫెవికాల్® ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్




బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది



OBM-4864 TL

# మీ ప్రియాతి ప్రియమైన బిడ్డకు ప్రత్యేకమైన సబ్బు కావద్దూ!

ప్రపంచమంతటిలోకీ సుతిమెత్తని పట్టులాంటి చర్మం మీ బిడ్డది. అంతటి నాజూకైన చర్మానికి మామూలు సబ్బెలా సరిపోగలదు!

మామూలు సబ్బులు పెద్దవారికోసం తయారైనవి. అందుచేత వాటితో పిల్లల లేత చర్మాలకు సరైన సంరక్షణ లభించజాలదు.

11-12 ఏళ్లలోపు వయసుగల పిల్లల చర్మాల సంరక్షణకై ఇప్పుడు వచ్చింది బబుల్స్. ఇదొక సౌమ్యమైన కొత్త సబ్బు. పిల్లలకోసం ప్రత్యేకించి తయారుచేయబడిన సబ్బు.

**బబుల్స్‌లోని ప్రత్యేకత ఏమిటి?**

బబుల్స్, మీరు మీ బిడ్డకోసం ఎలా తయారుచేసి ఉండేవారో అచ్చంగా అంతే జాగ్రత్తగా తయారుచేయబడినది. అంటే, శుద్ధమైన పోషక తైలాల సమ్మిశ్రణం, మమత నిండిన మాతృ స్పర్శలోని సౌమ్యత ఇందులో ఉన్నాయి.

బబుల్స్ మీ బిడ్డ చర్మాన్ని అది ఉండవలసిన రీతిలో, అంటే సహజమైన సమతూనికలో నిలిపి ఉంచుతుంది.

బబుల్స్ యొక్క సమృద్ధమైన నురగలో సంతోషంగా స్నానం చేయాలనీ, ఆడుకోవాలనీ మీ బిడ్డ మరీ మరీ కోరుతాడు.

బబుల్స్ ప్రపంచమంతటిలోకీ అతి ప్రత్యేకమైన కారణంగా తయారైనది. మీ బిడ్డ కోసమే తయారైనది.







**పిల్లలకోసం ప్రత్యేకమైన సబ్బు**

బబుల్స్–12 ఏళ్లలోపు వయసుగల పిల్లలకోసం.

everest/84/WIL/489-tl

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''దయాగుణం'']కు ఆధారం, ''వసుంధర'' రచన. సమాజంలో ఒక తరహా వ్యక్తులు కొందరుంటారు. వాళ్ళు ఆర్థికస్థోమతతో పాటు, లలితకళలను అంతో యింతో నేర్చి వుంటారు. దానితో వాళ్ళకు తమకు సాటిరాగలవాడు మరొకడు లేడన్న అహంభావం కలుగుతుంది. అలాంటి వాళ్ళకు ఏ విధంగా శృంగభంగం అయేదీ, ''సన్మానార్హత'' అన్న కథలో వివరించబడింది.

## అమరవాణి

నిశ్శంకం దీయతే యేన, స దాతా క్షున్నివారిణీ,
మధా స్యాక్ ధైర్యవాన్ యస్తు, స ఏవ పురుషోత్తమః.

[సందేహించకుండా యిచ్చేవాడే దాత; ఆకలి తీర్చేదే అమృతం; ధైర్యం కలవాడే మనుష్యుల్లో ఉత్తముడు.]

సంపుటి 76 మే '85 సంచిక 5

విడి ప్రతి : 2-00 :: సంవత్సర చందా : 24-00



# చందమామ కబుర్లు



## ఎత్తయిన ఏనుగు

ఖాఠ్మండుకు ఐదు కిలోమీటర్ల దూరంలో నైరుతీ దిశగా ఉన్న శుక్లాఫాంటా వన్యమృగాల నిలయంలో ప్రపంచంలోకెల్లా ఎత్తయిన ఏనుగు ఉన్నట్టు 'భారత వన్యప్రాణుల నిధి' తెలియజేస్తున్నది.

## మాట్లాడే చేపలు!



ఒక స్వీడన్ పరిశోధకుడు చేపల గురించి పదేళ్ళపాటు తీవ్రంగా పరిశోధనలు జరిపి—చేపలకూ భాష ఉన్నదని కనుగొన్నాడు. రకరకాల చిన్న చిన్న శబ్దాలు చేయడం ద్వారా చేపలు తమలో తాము మాట్లాడుకుంటాయని ఆ పరిశోధకుడు చెబుతున్నాడు।



## వృద్ధుల భూమి

సోవియట్ రష్యాలోని అజెర్‌బైజాన్‌లో వంద యేళ్ళకు పైబడ్డ వారు దాదాపు 1,500 మంది ఉన్నారు. వాళ్ళలో శ్రీమతి అల్లాఖియారోవా అనే వృద్ధురాలి వయసు 151 సంవత్సరాలు. ఈ వయసులోనూ ఆమె ఇంటిపనులు ఉత్సాహంగా చూసుకోవడమే కాకుండా, దుప్పట్లు కూడా నేస్తుంది. ఆమె కూతురికి 104 సంవత్సరాలు. ఆమె కూడా ఎంతో ఆరోగ్యంగా, ఉత్సాహంగా ఉన్నది.

# మీకు తెలుసా?

1. బౌతిక శాస్త్రంలో రెండుసార్లు నోబెల్ బహుమతి పొందిన వారెవరో మీకు తెలుసా?
2. రసాయనిక శాస్త్రంలో రెండుసార్లు నోబెల్ బహుమతి సాధించిందెవరు?
3. సోవియట్ రష్యా నుంచి మొట్టమొదటిసారిగా నోబెల్ బహుమతి అందుకున్న వారెవరు?
4. 'మాలిక్యూల్' అన్న మాటను రూపొందించిన శాస్త్రవేత్త ఎవరు?
5. మైకేల్ ఫేరడే 'రాయల్ సొసైటీ'కి ఎన్నికయినపుడు వ్యతిరేకంగా ఒక ఓటు పడింది. అలా వ్యతిరేకించిన వ్యక్తి ఎవరు?

(సమాధానాలు 64 వ పేజీలో)




ప్రతాపు డనే అతడికి, ఏ విద్యలోనూ ప్రావీణ్యం లేదు. కాని, అతడు కొందరు కళాకారులను చేరదీసి, వాళ్ళచేత ప్రదర్శన లిప్పించేవాడు. ఆ వచ్చిన డబ్బులో తను వాటా తీసుకునేవాడు. ఆ విధంగా అతడు చాలా డబ్బు సంపాయించాడు.

ఒకసారి ప్రతాపుడు, ఒక గాయకుడితో కలిసి చందనపురం అనే గ్రామానికి వెళ్ళాడు. అక్కడ ఆ గాయకుడి పాట కచ్చేరీకి బాగా డబ్బు వచ్చింది. కచ్చేరీ ముగిశాక, ఆ గ్రామంలో వుండే సుగంధుడు అనే ఆయన నుంచి, ప్రతాపుడికి పిలుపు వచ్చింది.

సుగంధుడు, ప్రతాపుడికీ, గాయకుడికీ చెరొక బంగారు పతకం యిచ్చి, "అద్భుతమైన గానం వినిపించిన గాయకుడికీ, అటువంటి చక్కటి గాయకుణ్ణి పదిమందికీ పరిచయం చేసిన వ్యక్తికీ, నేను చేయగలిగిన సన్మానం యిదే!" అన్నాడు సంతోషంగా.

ప్రతాపుడు ఆశ్చర్యపోయి, "డబ్బు కోసం మేమీపని చేస్తున్నాం. ఇందులో మమ్మల్ని సన్మానించవలసినంత ఘనత ఏమున్నది?" అన్నాడు.

"డబ్బు కోసం ప్రదర్శించినంత మాత్రాన, కళ కళ కాకుండా పోతుందా? కళాకారుల్ని నీలాగా ప్రోత్సహించక పోయినా, యిలా సన్మానించే అవకాశం రావడం—నా అదృష్టం," అన్నాడు సుగంధుడు.

ఆ తర్వాత, ప్రతాపుడు తను ఏ కళాకారుణ్ణి చేరదీసినా, విధిగా చందనపురం వెళుతూండేవాడు. ఆ విధంగా ఒక శిల్పి, చిత్రకారుడూ, కవి, మల్లుడూ చందనపురంలో తమ, తమ విద్యలను ప్రదర్శించి.

శ్రీరామకమల్



సుగంధుడి చేత బంగారు పతకాలు పొందారు.

ప్రతాపుడికి, సుగంధుడి విషయం ఆశ్చర్యంతోపాటు కుతూహలం కలిగించింది. అతడు ఎన్ని గ్రామాలు తిరిగినా, సుగంధుడి లాగా కళాకారులను సన్మానించినవాళ్ళు కానరాలేదు.

సుగంధుణ్ణి గురించి పదిమందికీ తెలియజెప్పాలనుకున్నాడు, ప్రతాపుడు. ఇందుకు సాయపడగలడనుకుని అతడు, చందనపురం గ్రామాధికారిని కలుసుకున్నాడు.

"ఆ సుగంధుణ్ణి గురించి అంతగా ఆలోచించకండి. అతడు పరమ గర్విష్ఠి. అందువల్లనే మేమంతా, అతడికి దూరంగా వుంటాం," అన్నాడు గ్రామాధికారి.

ప్రతాపుడికి గ్రామాధికారి మాటలు నమ్మబుద్ధి కాలేదు. ఒక కళాకారుడిలోని కళను గుర్తించి, సన్మానించాలనుకునే వ్యక్తి గర్విష్ఠి ఎలా అవుతాడు?

గ్రామాధికారికి సుగంధుడంటే యిష్టముండి వుండదనుకుని, ప్రతాపుడు మరికొందరు ఊరి పెద్దలతో మాట్లాడి చూశాడు. వాళ్ళు కూడా గ్రామాధికారి చెప్పినట్టే చెప్పారు.

ఎక్కడైనా ఒక గొప్పవాడుంటే, అతడి చుట్టూ వున్నవాళ్ళకు కొంత అసూయగా వుంటుంది! అందువల్లనే, గ్రామ పెద్దలందరూ అలా అంటున్నారని భావించి, ప్రతాపుడు ఒక రోజున స్వయంగా సుగంధుణ్ణి కలుసుకున్నాడు. సుగంధుడతడికి ఎప్పటిలాగే మర్యాద చేసి, వచ్చిన పని అడిగాడు.

ప్రతాపుడు ఎంతో వినయంగా, "మీవంటివారిని, నేనెక్కడా చూడలేదు. కళలంటే ఎంతో అభిమానమున్న మీరు, కళలనెందుకు అభ్యసించలేదా అన్న శంక నన్ను పీడిస్తున్నది," అన్నాడు.

"కళలను, నేనభ్యసించలేదని నీకెవరు చెప్పారు?" అన్నాడు సుగంధుడు శాంతంగా.

''ఉత్తమ కళాకారుడు, తనకు తెలిసిన కళలను ప్రదర్శించనిదే వుండలేడుగదా? అందువల్ల, అలా అనుకున్నాను,'' అన్నాడు ప్రతాపుడు.

''కళలను అర్థం చేసుకోగల రసిక హృదయులు వుండాలి. వాళ్ళు చాలా అరుదు. పద, నా కళా ప్రావీణ్యం చూద్దువుగాని,'' అంటూ సుగంధుడు అతణ్ణి ఒక విశాలమైన గదిలోకి తీసుకు పోయాడు.

అక్కడ సుగంధుడు చెక్కిన అద్భుతమైన శిల్పాలూ, గీసిన అపురూపచిత్రాలూ వున్నవి. వాటిని చూసిన ప్రతాపుడికి నోట మాట రాలేదు.

ఇద్దరూ గదిలోంచి బయిటికి వచ్చాక సుగంధుడు, ప్రతాపుడితో, ''ఇప్పుడు నాకు పాడాలన్న ఉత్సాహం కలుగుతున్నది,'' అంటూ గొంతెత్తి పాడసాగాడు.

ఆ అద్భుత గానానికి ప్రతాపుడు తన్మయత్వం చెందాడు. కొంతసేపు తరవాత సుగంధుడు పాడడం ఆపగానే అతడు, ''అయ్యా, నా అదృష్టం చాలా గొప్పది! మీ గానం వినే అవకాశం కలిగింది,'' అన్నాడు.

సుగంధుడు నవ్వి, ''నాకు పదునారేండ్లు నిండకముందే, అన్ని విద్యలూ నేర్చుకున్నాను. మా ఇంటి వెనక విశాల



మైన తోట వున్నది. ఆ తోటలోని ప్రకృతే నాకు శ్రోత, ప్రేక్షకులు. అక్కడే నా కళా ప్రదర్శన జరుగుతుంది. నాకు కవిత్వం వచ్చు. యుద్ధవిద్యలు నేర్చాను. ఒక్క మాటలో—అరవైనాలుగు కళలను ఆపోసనపట్టాను,'' అన్నాడు.

''మీరు చాలా గొప్పవారు. మీ గొప్పతనం మరుగున పడిపోవడానికి వీల్లేదు. నేను, మిమ్మల్ని రాజధానీ నగరానికి తీసుకువెళతాను. అక్కడ రాజుగారి ముందు, మీ కళాప్రదర్శన ఏర్పాటు చేస్తాను. మహారాజే స్వయంగా మీకు సన్మానం చేస్తారు,'' అన్నాడు ప్రతాపుడు ఉత్సాహంగా.

"నేను అల్పులముందు, నా విద్యలను ప్రదర్శించను. నన్ను సన్మానించే అర్హత గలవాడు యింకా ప్రపంచంలో పుట్టలేదు. అంతవరకూ, ఎవరి సన్మానాన్నీ నేను అంగీకరించను," అన్నాడు సుగంధుడు.

ఆ మాటలకు ప్రతాపుడు తెల్లబోయి, "మీరు సన్మానించినపుడు, ఎవరైనా మీ అర్హతల గురించి అడిగారా? మిమ్మల్ని సన్మానించాలంటే, అర్హతల గురించి అడగడం అన్యాయం కదా!" అన్నాడు.

సుగంధుడు దర్పంగా నవ్వి, "ఎవరినైనా సన్మానించగల అర్హతలు, నాకున్నవి. నన్ను సన్మానించే అర్హత మాత్రం ఎవరికీ లేదు," అని కొంచెం ఆగి, "ఇక్కడి పక్క గ్రామంలోని జమీందారుగారింటికి, వామనమూర్తి అనే వీణావిద్వాంసుడు వచ్చాడు. ఆయన్నిక్కడికి పిలిచి సన్మానించదలిచాను. రాదలుచుకుంటే, నా వెంటరా," అన్నాడు.

సుగంధుడి వెంట ప్రతాపుడు, ఆ వీణా విద్వాంసుడి దగ్గిరకు వెళ్ళాడు. విద్వాంసుడు సుగంధుడి కోర్కె వింటూనే, అతడి ముఖం కేసి తేరి పారచూసి, "నాకు, మీరు సన్మానం చేస్తారా? ఆశ్చర్యం! గానకళలో—అందునా వీణా వాదన గురించి మీకేం తెలుసు? మీ అర్హతలేమిటి?" అని అడిగాడు.

సుగంధుడు ఒక క్షణకాలం నివ్వెరపోయి, మారు మాట్లాడకుండా తల వంచుకుని, అక్కణ్ణించి బయలుదేరాడు. ప్రతాపుడు అతణ్ణి అనుసరించాడు.

దారిలో ప్రతాపుడు, సుగంధుడితో, "మీలాంటివాడే అయిన మరొక వ్యక్తిని చూడవలసిరావడం, నా అదృష్టమో, దురదృష్టమో చెప్పలేను. కాని, ఒక సంగతి: మీలో ఎంత ప్రతిభ వున్నప్పటికీ, మీ గర్వం కారణంగా, మీకు సన్మానార్హత లేదు. అర్హతలేని మిమ్మల్ని సన్మానించాలనుకోవడం, నా తెలివితక్కువ!" అన్నాడు.

ఆ తర్వాత ప్రతాపుడు ఏనాడూ సుగంధుడి ఇంటికి వెళ్ళలేదు.






## 7

[చంద్రవర్మ నదిలోపడి కొట్టుకుపోయి, ఒకానొక అడవి మధ్య ఒడ్డుపట్టాడు. అతడు తెప్పరిల్లి అడవిలో ప్రవేశించేసరికి, చెట్ల నుంచి కేకలు వినిపించినై. తరవాత చంద్రవర్మ కాపాలిని అనే మంత్రగత్తె గృహం చేరాడు. ఆమె గాజు గోళంలో వీరపురనగర పరిస్థితినీ, సేనాని ధీరమల్లుడు శత్రువులచే చుట్టుముట్టబడుతూండటాన్నీ చంద్రవర్మకు చూపింది. తరవాత—]

కాపాలిని చంద్రవర్మ భుజం మీద చేయి వేసి, ''నాయనా, చంద్రవర్మా! అధైర్య పడకు, కష్టాలు కలకాలం వుండవు. తిరిగి ఏదో ఒకనాడు నీ రాజ్యాన్ని జయించుకోగలవు. నాకు వాగ్దానం చేసిన విధంగా సాయపడ్డావంటే, ఆ తరవాత నీకు అన్నివిధాలా తోడ్పడతాను,'' అన్నది.

కాపాలిని మాటలు చంద్రవర్మకేమాత్రం ఉత్సాహం కలిగించలేదు. నూరు యోజనాల అవతల వున్న శంఖుడనే మాంత్రికుడి మంత్రగృహం ప్రవేశించి, కాపాలిని కోసం తను ఒకానొక వస్తువును సంగ్రహించుకు రావాలి. ఆ ప్రయత్నంలో తను చావకుండా బయటపడగలిగితే—అప్పుడు కాపాలిని తనకు చేస్తానన్న సహాయం ఉపయోగపడుతుంది. అలా కాక ఒకవేళ తను మరణిస్తే....



చంద్రవర్మ ఆలోచిస్తున్న విషయం ఏదో గ్రహించినదానిలా కాపాలిని ఒక్కసారి నిట్టూర్చి, అంతలోనే చిరునవ్వు నవ్వుతూ, "నాయనా, వర్మా! నీవు ఆలోచిస్తున్న సంగతేదో నేను గ్రహించాను. నువ్వీ నిమిషాన యిక్కణ్ణించి వెళ్ళదలిస్తే, వెళ్ళిపోవచ్చు; నేను ఆటంకపరచను. కాలనాగు గాని, అడవిలోని చెట్టుచేమలు గాని నీకు ఏమాత్రం హాని చేయవని హామీ యిస్తున్నాను, సరేనా?" అన్నది.

తను యిక్కడి నుంచి నిరాటంకంగా వెళ్ళిపోవచ్చునన్న మాట వింటూనే చంద్రవర్మ దిగాలుపడిపోయాడు. తను యిక్కడినించి వెళ్ళదలిచినా, వెళ్ళేందుకు ఒక స్థానం అంటూ ఎక్కడా వున్నట్టు అతడికి కనబడలేదు. ఇప్పటి పరిస్థితుల్లో తను అడవుల వెంటా, కొండల వెంటా ఒంటరిగా తిరగటం తప్ప చేయగలిగిందేమీ లేదు. తండ్రి మరణించాడు! రాజ్యం శత్రువుల హస్తగతం అయింది! విశ్వాసపాత్రుడైన సేవకుడు సుబాహుడు కనబడకుండా పోయాడు!

"కాపాలినీ, నేను నీకు నా సర్వశక్తులా సాయపడేందుకు ప్రయత్నిస్తాను. శంఖుడనే మాంత్రికుడి మంత్రగృహం నుంచి నేను తేవలసిన వస్తువేమిటి?" అన్నాడు చంద్రవర్మ ఉత్సాహంగా.

కాపాలిని ముఖం వికసించింది. ఆమె మెత్త మీది నుంచి లేచి తన చేత గల మానవాస్థికతో, గోడ పక్కన వున్న కొయ్య బొమ్మ తల మీద గట్టిగా కొడుతూ, "భైరవా! మన యింటికి అతిథి వచ్చాడు. త్వరగా విందు భోజనం వడ్డించు," అన్నది.

ఆ వెంటనే ఇల్లు దద్దరిల్లేలా 'హుం' అన్న బొబ్బ కేకతో ఒక మహాకాయుడు ప్రత్యక్షమై, "ఇదుగో, విందు భోజనం!" అంటూ అన్నిరకాల పదార్థాలూ, పిండివంటలూ ఒక బంగారు పళ్ళెంలో తెచ్చి చంద్రవర్మ ముందు పెట్టాడు.



చంద్రవర్మకు ఎక్కడలేని ఆకలీ పుట్టుకొచ్చింది. అతడు భోజనం చేస్తున్నంత సేపూ ఒకపక్క భైరవుడూ, మరో పక్క కాపాలినీ తృప్తిగా చూస్తూ నిలబడ్డారు. చంద్రవర్మ తినగలిగినంత తిని, మిగిలిన పదార్థాలతో బంగారు పళ్ళెరాన్ని దూరంగా తోయగానే, భైరవుడు చేయి కడుక్కునేందుకు నీళ్ళు తెచ్చాడు.

కాలనాగూ, భైరవుడూలాటి భయంకర శక్తులను తన చేతుల్లో వుంచుకున్న కాపాలిని, శంఖుడి మంత్రగృహం నుంచి తనకు కావలిసిన వస్తువును వాళ్ళద్వారా ఎందుకు తెప్పించుకో లేదు ? వాళ్ళకన్న తనలో వున్న అధిక శక్తులేమిటి? ఇందులో ఏదైనా మోసం లేదుగదా ? అనుకున్నాడు చంద్రవర్మ.

"నాయనా, చంద్రవర్మా! ఇప్పుడు ముఖ్య విషయాలగురించి మాట్లాడదాం. శంఖుడి మంత్రగృహంలో అపూర్వ శక్తులు గల ఒక శంఖం వున్నది. ఒకానొక మూలికతో కాచిన కషాయం అందులో పోసి తాగిన వాళ్ళకు వృద్ధాప్యం నశించి తిరుగా యౌవనం లభిస్తుంది. వెయ్యేళ్ళ వరకూ తిరిగి వృద్ధాప్యం వాళ్ళకేసి ముఖం చూపదు. ఇప్పటికి పది వందల ఎనభైఏళ్ళ క్రితం ఆ చికిత్స పొందాను. అప్పట్లో మాంత్రికుడైన శంఖుడు నాకు విరోధి కాడు. కాని, ఆ తరవాత అతడికి నాతో బద్ధ విరోధం ఏర్పడింది," అంటూ కాపాలిని చటుక్కున వెనుదిరిగి, భైరవుడికేసి కళ్ళురుముతూ చూసి, "ఛీ, నీచుడా! నీ పాడుబుద్ధి పోనిచ్చావుకాదు," అంటూ మానవాస్థికతో అతడి తలమీద బాదింది. వెంటనే భైరవుడు పెద్దగా మూలిగి కపీ మంటూ కొయ్యబొమ్మలా అయిపోయి గోడపక్కన కూలబడ్డాడు.

"వాడు నీ సేవకుడే గదా, ఎందుకు అంత కఠినంగా కొట్టావు?" అని అడిగాడు చంద్రవర్మ.

కాపాలిని వికటంగా నవ్వింది. "వాడు నా సేవకుడే, కాని వీలయితే నా రహస్యాలు

తెలుసుకుని, నన్ను తుద ముట్టించి శంఖుడి దగ్గిరకు పారిపోవటానికి వెను దీయని నీచుడు. అసలు యీ తుచ్ఛ భూతాలతో వచ్చిన చిక్కే యిది. వాళ్ళు సేవచేస్తున్న మాంత్రికులకన్న బలవంతు లెవరైనా కనిపిస్తే, వారి అండ చేరటానికి ప్రయత్నిస్తారు. అందుకే వాణ్ణి కొయ్య ముక్కలా చేసి అక్కడ పడవేసి వుంచు తున్నాను. శంఖుడు నా రహస్యాలు కనుక్కునేందుకు చాలామందిని పంపాడు. వాళ్ళకు పట్టిన దుస్థితి చూశావు గదా?'' అంటూ కాపాలిని ద్వారానికి తోరణంలా వేలాడగట్టిన కపాలాలను చంద్రవర్మకు చూపించింది.



ఆ కపాల తోరణాన్ని చూస్తూనే చంద్రవర్మ నిలువెల్లా వణికిపోయాడు. ఈ క్షణం వరకూ అతడు వాటికేసి పరీక్షగా చూసి వుండలేదు. శంఖుడు పంపిన దూతలు కాపాలినివల్ల హత మార్చబడి ద్వారానికి తోరణాలయ్యారు. అదే విధంగా కాపాలిని పంపిన దూతలు శంఖుడిచేత చంపబడి అతడి మెడలో హారాలై వుండవచ్చు!

''కాపాలినీ! నువ్వు పంపిన దూతల కపాలాలను కూడా శంఖుడు యిదే విధంగా ఉపయోగించుకుని వుండవచ్చు,'' అన్నాడు చంద్రవర్మ అనుమానంగా.

కాపాలిని లేదన్నట్టు తల అడ్డంగా తిప్పింది. ''నేనింతవరకూ అతడి దగ్గిరకు ఎవరినీ పంపలేదు. ఆ అపూర్వ శక్తులు గల శంఖాన్ని తస్కరించుకు రావాలంటే, అందుకు సమర్థుడైనవాడెవడో నాకు తెలుసు,'' అన్నది.

''ఆ సమర్థుడైనవాణ్ణి నేనని నీ అభి ప్రాయం, అంతేనా?'' అన్నాడు చంద్ర వర్మ ఎంతో ఆశ్చర్యపడుతూ.

''అవును, వర్మా!'' అన్నది కాపాలిని ఉత్సాహంగా. ''నీవు యువకుడివి, అంతే కాక క్షత్రియుడివి, ఆ పైన రాజ్యాన్నీ, బంధు మిత్రులనూ....సర్వం కోల్పోయిన వాడివి. అలాంటి నీకన్న సాహసికుడు




నా కెవరు దొరుకుతారు ? ఈ ప్రయత్నంలో నీవు జయించావంటే, ఆ తరవాత నీవు రాజువే కాదు, మొత్తం దేశానికే చక్రవర్తివి కాగలవు. దానికి మార్గం ఏమిటో ఆ అపూర్వశక్తులు గల శంఖాన్ని నా దగ్గిరకు తెచ్చిన తరవాత చెపుతాను." అన్నది.

కాపాలిని మాటలు చంద్రవర్మకు ఎంతో ఉత్సాహాన్ని కలిగించినై. కాని, అతడి హృదయంలో ఎక్కడో నలుసంత అనుమానం కూడా లేకపోలేదు. తనచేత ఆ శంఖాన్ని తెప్పించేందుకు కాపాలిని తనకు యీ విధమైన ఆశలు చూపుతూ వుండవచ్చు.

"సరే, ఆ మాంత్రికుడుండే చోటుకు వెళ్ళవలసిన మార్గం ఏమిటో చెప్పు. బయలుదేరుతాను." అన్నాడు చంద్రవర్మ. అతడిలో ఎక్కడ లేని తెగింపూ వచ్చింది.

కాపాలిని ఇంటి బయటికి దారి తీసింది. ఆమె వెనకనే చంద్రవర్మ బయటికి వచ్చాడు.

సూర్యుడు పడమటి దిక్కుకు జారుతున్నాడు. కాపాలిని ఉత్తర దిక్కుకేసి తిరిగి, చూపుడు వేలితో అటుకేసి చూపుతూ, "ఈ దిక్కుగా నూరు యోజనాల దూరంలో శంఖుడు వుండే కొండా, దాని మీద అతడి మంత్రగృహం వున్నవి. ఆ గృహంలోని పూజామందిరంలో ఆ అపూర్వశక్తులు గల శంఖం ఒక నాగుబాము మెడలో వేలాడుతూ వుంటుంది. ఆ నాగుబాము గోడకు వున్న ఒక బలమైన మేకుకు వేలాడుతూ వుంటుంది. నువ్వు మాంత్రికుడైన శంఖుడి నుంచి దానిని అతడితో మంచిగా స్నేహం చేసిగాని, లేక ఉపాయంతో మోసం చేసిగాని, ఆఖరుకు ప్రాణం తీసి అయినా సరే, తేవలసి వుంటుంది." అన్నది.

"అంత గొప్ప మాంత్రికుణ్ణి చంపడం కూడా సాధ్యమేనా ?" అన్నాడు చంద్రవర్మ ఆశ్చర్యంగా.



"ఎందుకు కాదు? ఎంత గొప్ప మాంత్రికుడైనా ఏదో ఒకనాడు చావక తీరదు. శంఖుడు ఇందుకు భిన్నం కాదు. అతణ్ణి హతమార్చటం ఏ విధంగా సాధ్యమో నువ్వే ప్రయత్నించి తెలుసుకో వలసి వుంటుంది," అన్నది కాపాలిని.

"అయితే, యిక నేను బయలుదేరుతాను," అంటూ చంద్రవర్మ తన దుస్తుల కేసీ, ఒరలో వున్న కత్తి కేసీ ఓమారు చూసుకుని ముందుకు నడిచాడు.

చంద్రవర్మ రెండు మూడడుగులు వేశాడో లేదో, వెనక నుంచి కాపాలిని ఆత్రంగా ముందుకు వచ్చి, అతడి భుజాన్ని పట్టుకుని ఆపుతూ, "నాయనా, వర్మా! ఒక ముఖ్యమైన సంగతే మరిచిపోయాను. శంఖుడి దగ్గిర ఒక వింత పక్షి వున్నది. దాని బలమూ, వేగమూ చెప్ప నలవికాదు. దాని పేరు అగ్నిపక్షి. అది ప్రతిరోజూ సూర్యాస్తమయం వేళ ఆహార సంపాదనకు బయలుదేరి, తిరిగి నడిరేయికి మాంత్రికుడి గృహం చేరుతుంది. అది ఆకాశంలో ఎగురుతున్నప్పుడు పెద్ద అగ్నిజ్వాలలా ప్రకాశిస్తుంది. దాని గుర్తుల ఆధారంతో, నీవు దారి తప్పకుండా మాంత్రికుడి గృహం చేరవచ్చు. నువ్వు వెళ్ళి రావలసిన దూరం రెండు వందల యోజనాలు. ఎంత కాలంలో పని పూర్తి చేసుకుని తిరిగి రాగలవు?" అని అడిగింది.

కాపాలిని అడిగిన ఈ ప్రశ్న చంద్రవర్మకు వింతగా తోచింది. అడవి మార్గానా, కొండదారుల వెంటా పడి నూరు యోజనాలు నడవాలి. ఆ తరవాత మహా శక్తివంతుడైన శంఖుణ్ణి లోబరుచుకుని ఆ శంఖం చేజిక్కించుకోవాలి. తిరిగి వచ్చేందుకు నూరు యోజనాలు నడవాలి. మార్గమధ్యంలో ఎన్ని ప్రమాదాలను ఎదుర్కోవలసివస్తుందో ఆ దేవుడికే తెలియాలి. అలాంటప్పుడు యింత కాలానికి తిరిగి రాగలనని మాట యివ్వటం ఎలా సాధ్యం అవుతుంది?

చంద్రవర్మ ఆలోచనలను పసికట్టిన దానిలా కాపాలిని వెలవెలపోతూ, ''అవును, వర్మా, నువ్వు చేయబూనిన సాహసం నాకు తెలియంది కాదు. కాని, యీనాటి నుంచి ఒక్క సంవత్సరంలో నీవు ఆ శంఖం తెచ్చి నా కివ్వగలిగితేనే, దానివల్ల నాకు ఉపయోగం వుంది. ఆ గడువుకు ఒక్క రోజు దాటినా అది నాకెందుకూ పనికిరాదు. సరే, ఏ కారణం వల్లనైనా నీవు తిరిగి ఒక సంవత్సరంలో రాలేకపోతే, యిక్కడ నేను వుండను. కాని, నీకు చేస్తానన్న సహాయం మాట మరవను. గాజుగోళం వున్న బల్ల సొరుగులో ఒక తాళపత్రం వుంచి పోతాను. దానిలో ఆ శంఖాన్ని నీ మేలుకు ఎలా ఉపయోగించుకోవాలో లిఖించబడి వుంటుంది,'' అన్నది కాపాలిని.

కాపాలిని అన్న ఈ మాటలతో చంద్రవర్మకు ఆమె మీద ఎక్కడలేని విశ్వాసమూ కలిగింది. మాంత్రికురాలు తనను మోసగించటం లేదని అతడు నమ్మాడు. ఆ కారణం వల్ల చంద్రవర్మ చటుక్కున మాంత్రికురాలి రెండు చేతులూ ఆప్యాయంగా పట్టుకుని, ''ఒక్క సంవత్సరంలో ఆ శంఖాన్ని తీసుకుని నేను తిరిగి వస్తాను,'' అంటూ ఆమె చేతులు వదిలి ముందుకు నడిచాడు. ఆ వెంటనే కాపాలిని, ''కాలనాగూ!'' అంటూ మూడు తలల సర్పాన్ని పిలిచింది. సర్పం బుసలు కొడుతూ దగ్గిరకు రాగానే ఆమె చంద్రవర్మను సర్పానికి చూపుతూ, ''అతడికి అడవి దాటేవరకూ రక్షణగా వుండి రా!'' అని ఆజ్ఞాపించింది.

కాలసర్పం ఒక్క దూకున చంద్రవర్మ ముందుకు వెళ్ళి, అతడికి మార్గం చూపుతూ నడవసాగింది. చంద్రవర్మ చెట్లలో కొంత దూరం వెళ్ళిన తరవాత వెనుదిరిగి చూశాడు. అతడికి కాపాలిని కనిపించలేదు. కాని, ఇల్లు వుండవలసిన చోట గద్ద తలా, రెక్కలూ—సింహ శరీరంతో వున్న ఒక పెద్ద వికృతాకారం కంటబడింది. [ఇంకా వుంది]






# దయాగుణం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీలో వున్న దయాగుణంకొద్దీ, ఫలాని కార్యం సాధిస్తానని ఎవరికో మాటయిచ్చి, వాగ్దానభంగం జరుగుతుందన్న భయంతో, ఈ భయంకర శ్మశానంలో నానా అగచాట్లూ పడుతున్నావని, నాకు అనుమానం కలుగుతున్నది. మనిషిలో వుండే మంచి గుణాలన్నిటిలో, దయాగుణం భూషణం లాంటిది. కాని, మనిషి దాన్ని విచక్షణా రహితంగా ప్రదర్శిస్తే, అనేక అనర్థాలకు దారి తీస్తుంది. ఇందుకు ఉదాహరణగా నీకు, దయానిధి అనే ధనికుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను." అంటూ యిలా చెప్పసాగాడు :

## బేతాళ కథలు



ఒకానొక గ్రామంలో దయానిధి అనే ధనికుడుండేవాడు. పేరుకు తగ్గట్టే ఆయన ఎంతో దయగలవాడు. తనపట్ల తప్పు చేసినవారిని కూడా ఆయన మనస్ఫూర్తిగా క్షమించేవాడు. అంతేకాదు, ఎవరైనా తప్పు చేస్తే, ఎందుకు చేశారో ఆలోచించి, మళ్లీ వాళ్ళా తప్పు చేయకుండా నీతిబోధ చేసేవాడు.

దయానిధి యింట్లో రాముడనే పనివాడున్నాడు. వాడు చిన్నతనం నుంచీ దయానిధి ఇంట్లో పెరిగాడు. అందువల్ల, మిగతా పనివాళ్ళ మీద కంటె, రాముడంటే ఆయనకు ప్రత్యేకాభిమానం వుండేది.

ఇలా వుండగా, కొంతకాలానికి రాముడికి పెళ్ళయింది. రాముడు అస్తమానూ భార్యకు దయానిధి గొప్పతనం గురించి చెబుతూండేవాడు. ఆయన తనకెన్ని ఉపకారాలు చేశాడో, వాడు భార్యకు వివరంగా చెప్పుకున్నాడు.

రాముడి భార్య ఆశాపాతకి. అవిడ రాముడితో, "నీ యజమాని గురించి యిన్ని కబుర్లు చెబుతావు. వాళ్ళింట్లో బోలెడు పట్టుచీరలున్నవి; నాకు ఒక్కటైనా లేదు. ఆయన భార్యకూ, కూతురికీ చాలా నగలున్నవి; నాకు ఒక్కటైనా లేదు," అన్నది.

రాముడికి యిది నిజమేననిపించింది. అయితే, వాడేనాడూ యిది కావాలని యజమానిని అడగలేదు. దయానిధి తనే వాడి అవసరాలు కనిపెట్టి, అడగకుండానే వాడికి కావలసినవి సమకూర్చేవాడు.

రాముడు తన భార్య అన్న మాటలు తోటి పనివాళ్ళకు చెప్పాడు. వాళ్ళు, వాణ్ణి మందలించి, "ఎవరి తెలివీ, చొరవలనుబట్టి, వాళ్ళ సంపాదన వుంటుంది. మన యజమానిలాంటి వాళ్ళు పచ్చగా వుంటేనే మనకు రోజులు సుఖంగా గడుస్తాయి. ఇప్పుడు మనం చేస్తున్న పనే, యింకెవరిదగ్గిరకైనా వెళ్ళి చేద్దామంటే—ఎవరూ దయానిధిగారిచ్చినంతగా

యివ్వరు. మా అందరిలో, నువ్వంటేనే ఆయనకు ఎక్కువ అభిమానం,'' అన్నారు.

రాముడికి వాళ్ళు చెప్పిందీ నిజమే ననిపించింది. ఆ సంగతి వాడు భార్యకు చెప్పాడు.

''అంటే, నువ్విక్కడ పని చేసినంత కాలం, నీ బతుకు ఎదుగూ, బొదుగు ల్లేకుండా వుంటుందన్నమాట! నువ్వు కూడా, నీ యజమానిలాగే మరేదైనా సొంత పని చేసుకుని డబ్బు సంపాయించరాదా?'' అన్నది రాముడి భార్య.



''నాకా తెలివితేటలు లేవు!'' అన్నాడు రాముడు.

''అయితే, దొంగతనం చెయ్యి,'' అన్నదావిడ కసిగా.

దొంగతనం అనగానే రాముడు భయ పడ్డాడు. ఎలా చేయాలో, ఎక్కడ చేయాలో కూడా వాడికి అర్థంకాలేదు.

''నీ యజమాని ఇంట్లోనే దొంగతనం చెయ్యి. ఆయనకు నీ మీద చాలా నమ్మకం. అందువల్ల అన్నీ నీకు అందు బాటులోనే వుంటవి. విలువైనదేదైనా చేజిక్కించుకుని రా. ఆ డబ్బుతో ఎక్కడి కైనా వెళ్ళి, ఏదో ఒక వ్యాపారం చేసి బోలెడు సంపాయించవచ్చు. అప్పుడు నాకు వంటినిండా పట్టుచీరలు, మెడ నిండా నగలు!'' అన్నది రాముడి భార్య ఉత్సాహంగా.

ఇందుకు రాముడు వెంటనే ఒప్పుకో లేదు. భార్య పోరగా, పోరగా చివరకు సరేనన్నాడు.

ఒకరోజున వాడు దయానిధి ఇల్లంతా కలయతిరుగుతూ, ఒక గదిలో ఇనప్పెట్టె తలుపులు తెరిచి వుండడం గమనించాడు. వాడు అటూ యిటూ చూసి, పెట్టెలోంచి ఒక వరహాల మూట తీసుకుని, గబగబా ఇంటికిపోయి దాన్ని భార్యకిచ్చాడు.

వాడి భార్య అందులోని వరహాలు లెక్కపెట్టి, ''అబ్బా, ఎంత డబ్బో!'' అన్నది ఆనందంగా.

మర్నాడు దయానిధికి డబ్బు పోయిన విషయం తెలిసింది. అప్పుడాయన విచారంగా, "ఇది దొంగల పనికాదు!" అనుకుని పనివాళ్ళను పిలిచి, సంగతి చెప్పి, "మీలో ఎవరో యీ దొంగతనం చేశారు. ఇంతకాలం విశ్వాసంగా పనిచేసిన వాడొకడు, దొంగతనానికి పాల్పడ్డాడంటే, తప్పు నాదే అయి వుండాలి. మీకు, నా మీద అభిమానం తగ్గిపోయింది!" అని కళ్ళనీళ్లు పెట్టుకున్నాడు.

దొంగతనం గురించి కోప్పడటానికి బదులు, బాధపడుతున్న యజమానిని చూసి, పనివాళ్ళందరికీ భయభక్తులతో పాటు, ఆయనపట్ల అభిమానం కూడా మరింత పెరిగింది.

పనివాళ్ళల్లో ఇద్దరు, దయానిధితో "అయ్యా, మేమిద్దరం వెళ్ళి, మిగతా పనివాళ్ళ ఇళ్ళు సోదా చేసివస్తాం. అంతవరకూ మిగిలినవాళ్ళంతా యిక్కడే వుంటారు," అన్నారు.

సోదా చేయగా డబ్బు రాముడి ఇంట్లో దొరికింది. తన గతి ఏమికానున్నదో అని రాముడు హడలిపోయాడు.

"నీకేం కావాలన్నా, నేనిస్తున్నానుగా? దొంగతనం ఎందుకు చేశావు? నావల్ల, నీకేదైనా లోటు జరిగిందా?" అని దయానిధి, రాముణ్ణి అడిగాడు బాధగా.

రాముడు, ఆయన కాళ్ళపై పడ్డాడు. దయానిధి వాణ్ణి క్షమించి, "ఇంకెప్పుడూ, యిలాంటి పని చెయ్యకు," అన్నాడు.



ఆ తర్వాత రాముడు మళ్ళీ యజమాని ఇంట్లో దొంగతనం చెయ్యలేదు. కాని, అక్కడ వాడికి బతుకు దుర్భరమయింది. ఒకవంక డబ్బు సంపాయించమని భార్య రోజు తప్పకుండా పోరుతున్నది; ఇంకొక వంక తోటి పనివాళ్ళందరూ వాణ్ణి దొంగ, దొంగ అని హేళన చేసి చిన్నచూపు చూస్తున్నారు.

ఒక రోజున రాముడు, దయానిధి వద్దకు వెళ్ళి, "బాబుగారూ, అందరూ నన్ను దొంగ అని అవమానిస్తున్నారు. నేనింకెక్కడికైనా వెళ్ళిపోతాను. సెల విప్పించండి," అన్నాడు.

దయానిధి మిగతా పనివాళ్ళనందర్నీ మందలిస్తానన్నాడు. వాడి భార్యకొక పట్టుచీర కొనిపెడతానన్నాడు. ఇలా ఎన్నో విధాల నచ్చజెప్ప చూస్తూ, "నువ్వు మరొకచోటుకు పోతే కష్టపడతావన్నది, నా భయం. చిన్నప్పటి నుంచీ, మా ఇంట్లోనే పెరిగినందున నువ్వంటే, నాకు అభిమానం. నువ్వు వెళ్ళిపోవడానికి, నావల్ల ఏదో లోటు జరిగిందేమో అని, నా అనుమానం. ఈ మూడు కారణాల వల్లా—నువ్వు వెళ్ళిపోతానంటే, నాకెంతో విచారంగా వున్నది," అన్నాడు అఖరుకు.

ఎన్నిచెప్పినా రాముడు వినకపోయే సరికి, ఆయన వాడికి కొంత డబ్బిచ్చి, "ఎక్కడికి వెళ్ళినా, నువ్వు సుఖంగా వుండాలి. అదే నా కోరిక!" అన్నాడు. రాముడు వెళ్ళిపోయాడు.





దయానిధి భార్య జరిగింది విని, "వాడు దొంగతనం చేసి పట్టుబడగానే, ఆ డబ్బు మొత్తం వాడికే యిచ్చివేస్తే బావుండేది. అలా చేస్తే, వాడికి మీ అభిమానం పట్ల తప్పక గట్టి నమ్మకం కలిగేది," అన్నది.

"అలా చేస్తే, ప్రతి పనివాడూ రోజు కొక దొంగతనం మొదలుపెడతాడు. దొంగ తనం చేసిన డబ్బు, దొంగకే బహుమతిగా యివ్వడం మంచి పద్ధతికాదు," అన్నాడు దయానిధి.

ఆ తర్వాత ఎన్నో ఏళ్ళు గడిచి పోయాయి. దయానిధి యిప్పుడు ముసలి వాడు. ఆయన కొడుకు అన్ని వ్యాపార వ్యవహారాలూ సక్రమంగా, దక్షతతో చూసుకుంటున్నాడు.

ఒక రోజు రాత్రి సుమారు ఇరవైఏళ్ళ యువకు డొకడు, దయానిధి ఇంట్లో దొంగ తనానికి ప్రవేశించి దొరికిపోయాడు. వాడు దయానిధి కాళ్ళ మీద పడి, "నన్ను క్షమించి వదిలిపెట్టండి! నేను ఒకప్పుడు మీ ఇంట్లో పనిచేసి వెళ్ళిపోయిన, రాముడి కొడుకును!" అన్నాడు.

దయానిధి ఆశ్చర్యపోయి, రాముడి వివరాలడిగాడు.

రాముడు, దయానిధి యిచ్చిన డబ్బుతో కూరగాయల వ్యాపారం ప్రారంభించాడు. కాని, అందులో వచ్చే లాభం, వాడి తిండీ, బట్టకు బొటాబొటిగా సరి పోతున్నది. వాడి భార్య, భర్తను ప్రోత్స హించినట్టే కొడుకును కూడా దొంగ తనాలకు ప్రోత్సహిస్తున్నది.

"అయితే, నువ్వు నా ఇంటికే దొంగ తనానికి ఎందుకొచ్చావు?" అని అడి గాడు దయానిధి. రాముడి కింకా తనపై పగ పోనందుకు, ఆయన మనసులో నొచ్చుకున్నాడు.

"మొదటి దొంగతనం, మీ ఇంట్లోనే చేయమన్నాడు, మా నాన్న. దొంగతనం నేర్చుకునేందుకు, మీ ఇల్లే అనువుగా వుంటుందట! ఒకవేళ పట్టుబడినా, మీరు

క్షమించి వదిలేస్తారట!'' అన్నాడు రాముడి కొడుకు.

ఈ జవాబు వింటూనే, దయానిధి వాడిని ఆప్యాయంగా కౌగలించుకుని, ''నువ్వింకెప్పుడూ దొంగతనాలు చేయకు. వ్యాపారంలో నిన్ను, నా అంతటివాణ్ణి చేస్తాను. ఇక్కడే నాతో వుండు!'' అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, దొంగతనం చేస్తూ దొరికిపోయిన రాముడి కొడుకును, దయానిధి శిక్షించకపోగా, వాణ్ణి వ్యాపారంలో తనంతటివాణ్ణి చేస్తానంటూ చేరదీయడాన్ని ఏమనాలి? విచక్షణారహితంగా అతడు ప్రదర్శించే దయాగుణం వల్ల, మరి కొందరు చోరులయ్యే ప్రమాదం వున్నది గదా. ఇంతకూ అసలు దయానిధిలో వున్నది, అమాయకత్వమా లేక దయాగుణమా? అన్న అనుమానం కలుగుతున్నది. ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''సమాజంలో దయానిధి లాంటివాళ్ళు, చాలా అరుదైన మనుషులు. రాముడు దొంగతనం చేసినప్పుడు క్షమించినా, వాడు తన దయాగుణాన్ని నమ్మలేదనీ, అందుకే వెళ్ళిపోయాడనీ, అతడికొక అనుమానం వున్నది. కాని, వాడు తన కొడుకును, తన ఇంటికే దొంగతనానికి పంపుతూ, తన దయాగుణాన్ని మెచ్చుకోవడంతో, ఆ అనుమానం తొలిగిపోయింది. ఆ కారణం వల్లనే, తన మీద అంత నమ్మకం వుంచిన రాముడి కుటుంబాన్ని ఆదుకోవాలనుకున్నాడు. అదేం అమాయకత్వం కాదు. మంచి మనసు గల మనిషి, ఇతర్ల మెప్పుకోసం అర్థించడు. కాని, ఆ మంచితనం ఇతర్లు గుర్తించినప్పుడు తప్పక ఆనందిస్తాడు. దయానిధి ప్రవర్తనకు అదే మూలకారణం,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# సమయస్ఫూర్తి

సిరిపురం జమీందారు తన మామిడితోటలో, ఒక విశ్రాంతి భవనాన్ని కట్టించాడు. దానికి రంగు వేయడానికి మనిషి కావలసి వచ్చాడు. జమీందారు స్వభావం తెలిసిన వాళ్ళెవరూ ముందుకు రాలేదు. ఏ పనీ ఆయనకు నచ్చేటట్టు చేయడం చాలా కష్టం.

ఆ ఊరుకు ఏదో పని మీద వచ్చిన సోమనాథుడనేవాడు జమీందారును కలుసుకుని, "అయ్యా, నేను తమ ఊళ్ళో ఒక వారంరోజులపాటు వుండబోతున్నాను. తమ విశ్రాంతి భవనానికి రంగువేసే పని, నాకు ఇప్పించండి," అని అడిగాడు.

"నేను చెప్పిన రంగు వేయలేని పక్షంలో, నీకొక్క చిల్లిగవ్వ కూడా యివ్వను. నాకు తృప్తి గలిగితేనే డబ్బు యిస్తాను," అన్నాడు జమీందారు.

సోమనాథుడు ఒప్పుకున్నాడు. జమీందారు ఒక చిన్న చెక్కపెట్టెను తెచ్చి, అతడికిస్తూ, "భవనం లోపలి గోడలకు, అచ్చగా యీ చెక్కపెట్టె ఏ రంగులో వున్నదో అలాంటి రంగే వేయాలి," అన్నాడు. సోమనాథుడు వారం రోజుల్లో పని పూర్తి చేశాడు. జమీందారు చెక్కపెట్టెను ప్రతి గోడ దగ్గిరకూ తీసుకుపోయి, జాగ్రత్తగా గోడ రంగూ, దాని రంగూ పోల్చి తృప్తిపడి, సోమనాథుడికి డబ్బిచ్చాడు.

మరొక వారం తరవాత జమీందారు, భార్యతో విశ్రాంతి భవనానికి పోయి, సోమనాథుడి పనితనాన్ని మెచ్చుకుంటూ, "వాడు రంగులు కలపడంలో, మహా దిట్ట అయి వుండాలి. నేనిచ్చిన చెక్కపెట్టె రంగే గోడలకు వేశాడు. మన దివాణంలో ఉద్యోగం యిస్తే, పాపం యిక్కడే వుండిపోయేవాడు!" అన్నాడు.

జమీందారు భార్యకు ఏదో అనుమానం కలిగి, చెక్కపెట్టెను గోటితో గీకి చూసింది. కొత్తగా దానికి వేసిన రంగు బయటపడింది. ఆమె పొట్టచెక్కలయ్యేలా నవ్వుతూ, "వాడు, మీరు చెప్పినట్టు చెక్కపెట్టెకున్న రంగు గోడలకు వెయ్యలేదు—గోడలకు వేసిన రంగు చెక్కపెట్టెకు వేశాడు!" అన్నది.

జమీందారుకు జరిగిన మోసానికి కోపం వచ్చినా, సోమనాథుడి తెలివికి తనూ నవ్వకుండా వుండలేకపోయాడు.

—సి. యస్. ఎ. షరీఫ్





# రాకుమారి విచారం

స్వర్ణపురి రాజకుమారి కుసుమలత, బాల్యం నుంచీ చిత్రలేఖనం పట్ల ఎంతో ఆసక్తి కనబరిచేది. ఆమె అభిరుచిని గుర్తించిన మహారాజు మనోహరసింహుడు, ప్రసిద్ధుడైన ద్యోతకుడనే చిత్రకారుణ్ణి ఆహ్వానించి, ఆమెకు చిత్ర కళలోని సూక్ష్మాలన్నిటినీ నేర్పించాడు.

కొన్నాళ్ళు గడిచాక ఒక రోజున ద్యోతకుడు, మనోహరసింహుడితో, "ప్రభూ, అమ్మాయికి యిక నేను చెప్పవలసిందేమీ లేదు. చిత్రకళలో ఆమె సాధించిన ప్రావీణ్యత నన్నే మించిపోయిందని అనిపిస్తున్నది!" అన్నాడు.

మహారాజు, ద్యోతకుడి మాటలకు చాలా సంతోషించి, అతడికి బహుమతులిచ్చి పంపేశాడు.

ఆ తరవాత కొన్నాళ్ళకు కుసుమలత ఒక చిత్రాన్ని చిత్రించింది: అందులో అందమైన యువకుడొకడు స్వచ్ఛమైన తెల్లని గుర్రం మీద ఒక చేత కళ్ళాన్నీ, మరొక చేత ఖడ్గాన్నీ పట్టుకుని కూర్చుని వుంటాడు. అయితే, ఆ చిత్రాన్ని పూర్తి చేసిన నాటి నుంచీ, కుసుమలత ప్రవర్తనలో, ఏదో విచిత్రమైన మార్పు కనబడసాగింది. ఆ చిత్రాన్ని చూసినప్పుడల్లా, ఆమె కళ్ళ వెంట నీళ్ళు కూడా వచ్చేవి. మహారాజూ, మహారాణీ ఎంత బుజ్జగించి అడిగినా, ఆమె విచారానికి కారణం చెప్పేదికాదు. ఆమె ఆరోగ్యం నానాటికీ క్షీణించసాగింది.

ఒకనాడు మంత్రి అజయశర్మ, రాజుతో, "మహారాజా, రాజకుమారి గీసిన చిత్రంలో ఏదో లోపమున్నదని, నా అనుమానం! మనం ఒకసారి ద్యోతకుణ్ణి పిలిపించి, సంగతేమిటో పరిశీలించమంటే, ఏమైనా ప్రయోజనం వుండవచ్చు," అన్నాడు.

క మ లి ని



మహారాజు, ద్యోతకుణ్ణి పిలిపించి, చిత్రాన్ని పరిశీలించవలసిందిగా కోరాడు. అతడొక రోజంతా చిత్రాన్ని సూక్ష్మాతిసూక్ష్మంగా పరీక్షించి చూసి, ''ప్రభూ, ఇలాంటి చిత్రాన్ని గీయడం మరెవరికీ సాధ్యమయే పని కాదు. చిత్ర రచనలో ఎటువంటి లోపాలూ లేవని రాజకుమారికి ఎంతగానో నచ్చ చెప్పాలని చూశాను. ప్రయోజనం కలగలేదు,'' అన్నాడు.

ద్యోతకుడు వెళ్ళిపోయాక, ఒకనాడు కుసుమలత యిష్టసఖి ఇందులేఖ, మహారాజును ఏకాంతంగా చూడబోయి, ''ప్రభూ, తమరు మన్నిస్తానంటే, ఒక విషయం చెప్పదలిచాను. ఆ చిత్రంలో వున్న యువకుణ్ణి రాజకుమారి ఎక్కడైనా చూసి వుండవచ్చు. ఆమె అతణ్ణి వివాహమాడ కోరుతున్నదని, నా నమ్మకం. ఈ సంగతి తమకు చెప్పడానికి, ఆమె సంకోచిస్తూ వుండవచ్చు,'' అన్నది.

మహారాజుకు, ఇందులేఖ చెప్పింది నిజమేమో నన్న అనుమానం కలిగింది. ఆయన, మహారాణిని వెంటబెట్టుకుని, కుసుమలత దగ్గిరకు పోయి, ''నువ్వు గీసిన చిత్రంలో వున్న యువకుణ్ణి ఎక్కడైనా చూశావా? ఒకవేళ నువ్వతణ్ణి వివాహం ఆడ గోరితే, ఆ సంగతి మాకు చెప్పు. అతడెక్కడున్నా రప్పించి వివాహం చేస్తాం,'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే కుసుమలత కోపంగా, ''నాన్నా, నువ్వు ఒట్టి అసందర్భాలు పలుకుతున్నావు!'' అంటూ దిండులో తల దూర్చి దుఃఖించసాగింది.

మహారాజుకు ఏం చేయాలో అంతుబట్టలేదు. ఆయన ఆ సాయంత్రం ఉద్యానానికి పోయి, మంత్రిని పిలిపించి, కుమార్తె అన్న మాటలు చెప్పాడు.

మంత్రి అజయశర్మ కొంచెం సేపు ఆలోచించి, ''మహారాజా, మనం ఒక పని చెయ్యడం బావుంటుంది. రాజకుమారి విచారానికి కారణం తెలుసుకుని ఆమెను సంతోష పెట్టగలవాడికి, ఒక చిన్న

సామంతరాజ్యం యిస్తామని ప్రకటిద్దాం. ఇందువల్ల ఏమైనా మేలు జరగవచ్చు.'' అని సలహా యిచ్చాడు.

మహారాజు ఆ ప్రకారమే దేశదేశాల్లో దండోరా వేయించాడు. ఎందరో చిత్రకారులూ, మేధావులూ వచ్చి, రాజకుమారి విచారానికి కారణం తెలుసుకోవాలని ప్రయత్నించి విఫలురై వెళ్ళిపోయారు.

మహారాజు యిప్పుడేం చేయడమా అన్న దిగులుతో వుండగా, ఒకనాడు సుకేతుడనే వాడు వచ్చి, ''ప్రభూ, రాకుమారి గీసిన చిత్రాన్ని ఒకసారి నన్ను చూడనిస్తే, ఆమె దిగులుకు కారణం చెప్పగలనన్న ధైర్యం వున్నది,'' అన్నాడు.

అందుకు మహారాజు చిరాకుపడుతూ, ''చిత్రంలో ఎలాంటి లోపం లేదన్నది, గురువులకే గురువైన ద్యోతకుడు ఎప్పుడో చెప్పేశాడు. ఇంతకూ నీకున్న యోగ్యత లేమిటి ?'' అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు సుకేతుడు ఒక క్షణం ఆగి, ''ప్రభూ, క్షమించాలి! యోగ్యతల విషయానికొస్తే—ఇంతకు ముందే మీరు చెప్పినట్టు, రాజకుమారిని గొప్ప చిత్రకారులూ, మహామేధావులూ దర్శించి వెళ్ళారు. కాని, ఆమె విచారం, విచారంగానే వుండిపోయింది. కనుక, యిక్కడ నా యోగ్యతల సంగతి అంత ముఖ్యం



కాదు. ఇక్కడ అవసరం అయినదేమంటే, లోకజ్ఞత! కావడానికి నేను అనేక రాజాస్థానాల్లో నాట్యాచార్యుడుగానూ, చిత్ర, సంగీత సాహిత్య శిక్షకుడుగానూ పని చేశాను,'' అన్నాడు.

అప్పుడు మంత్రి, ''మహారాజా, ఈయనకూ ఒక అవకాశం యిచ్చి చూడండి,'' అన్నాడు.

మహారాజు సరేనన్న మీదట సుకేతుడు, కుసుమలత గీసిన చిత్తరువును పూర్తిగా పరీక్షించి, ఆమెతో, ''రాకుమారీ, మీరి లాంటి చిత్రాన్ని మరొకదాన్ని, యీ జన్మలో రచించలేరు. అదే మీ విచారానికి కారణం. సాధ్యపడనిదాన్ని గురించి,

ఎంత విచారపడీ లాభం లేదు గదా!' అన్నాడు.

కుసుమలత, సుకేతుడి కేసి కుతూహలంగా చూసేంతలో మహారాజు కోపంగా, "నిన్ను రాజకుమారి విచారానికి కారణం తెలుసుకోమన్నాను కాని, చిత్రకళలో ఆమె ప్రజ్ఞాపాటవాలను అంచనా కట్టమన లేదు," అన్నాడు.

"ప్రభూ, యిప్పుడు నేను తెలుసుకున్నది, రాజకుమారి విచారానికి మూల కారణం! మనిషి తాను ఆశించినది సాధించలేనప్పుడే కాక, ఇక తాను సాధించవలసినదేమీ లేదని తెలుసుకున్నప్పుడు కూడా విచారానికి గురవుతాడు. రాకుమారి విషయంలో యిదే జరిగింది. లలితకళల పట్ల ఎంతో ఆసక్తి వున్న యీమె, ఇప్పుడు సంగీత, నాట్యకళలను అభ్యసించే ప్రయత్నంలో తన విచారాన్ని మరిచిపోవచ్చు," అన్నాడు సుకేతుడు.

సుకేతుడు యిలా అనగానే మహారాజు కుమార్తె కేసి చూశాడు. కుసుమలత మందహాసం చేసి, "నాన్నా, వీరన్నది నిజం. ఈ గుర్రపురౌతు చిత్రాన్ని, చిత్రకళలో నాకు తెలిసిన మెళుకువలన్నీ మేళవించి రచించాను. దీన్ని మించిన చిత్రాన్ని మరొకటి నేను చిత్రించలేను. అదే, నా విచారకారణం. వీరు నేను సాధించినదేదో తెలియజెప్పి, ముందు కర్తవ్యమేమిటో కూడా వివరించారు. నేను నాట్యం, సంగీతం నేర్వదలిచాను. అందుకు వీరే నాకు గురువులు!" అంటూ సుకేతుడి పాదాలకు నమస్కరించింది.

మహారాజు పరమానందం చెంది, సుకేతుడితో, "ఆచార్యా, మీరే నా కుమార్తెకు గురువులు. అన్న ప్రకారం మీకు సామంతరాజ్యం యిస్తున్నాను," అన్నాడు.

సుకేతుడు చిన్నగా నవ్వి, "నేను కళారాధకుణ్ణి; నాకు రాజ్యం ఎందుకు! తమ ఆస్థానంలోనే వుంటూ, రాకుమారికి నా చేతనైనంతలో నాట్య సంగీత విద్యల్లో శిక్షణ యివ్వగలను," అన్నాడు.





# దేవధర్మం

చాలాకాలం క్రితం కాశీరాజుకు పట్టపురాణి యందు ఇద్దరు కొడుకులు కలిగారు. రాజు వారికి మహింసాసుడనీ, చంద్రకుమారుడనీ పేర్లు పెట్టాడు. మహింసాసుడే బోధిసత్వుడు. చంద్రకుమారుడు పసివాడుగా ఉండగానే తల్లి చనిపోయింది.

అప్పుడు రాజు మరొక భార్యను పెళ్ళాడి, ఆమెను పట్టపురాణిని చేశాడు. ఆమె రాజుకు ప్రేమపాత్రురాలు గానూ, అనుకూలవతి గానూ ఉంటూ, కాలక్రమాన తాను కూడా ఒక పిల్లవాణ్ణి కన్నది. వాడికి సూర్యకుమారు డని పేరు పెట్టారు. రాజు ఈ పుత్రుణ్ణి చూసి సంతోషించి, పట్టపురాణితో, "నీ కొడుక్కు ఏదైనా వరం ఇస్తాను," అన్నాడు.

"ఇప్పుడు కాదు, నాకు కోరాలనిపించి నప్పుడు వరం అడిగి పుచ్చుకుంటాను," అన్నది పట్టపురాణి.

కొంత కాలానికి సూర్యకుమారుడు యుక్తవయస్కుడయాడు. అప్పుడు పట్టపురాణి రాజుతో, "నాకు కొడుకు పుట్టినప్పుడు వరం ఇస్తానన్నారు. ఇప్పుడా మాట చెల్లించి, నా కొడుక్కు రాజ్యం ఇయ్యండి," అన్నది.

"అగ్నిజ్వాలల లాగా ప్రకాశించే పెద్ద కొడుకులు ఇద్దరుండగా నీ కొడుక్కు రాజ్యం ఇవ్వటం నాకు సాధ్యం కాదు," అన్నాడు రాజు.

పట్టపురాణి తన పెద్ద కొడుకులకు హాని చేయవచ్చునని రాజుకు అనుమానం కలిగింది. ఆయన మహింసాసుణ్ణీ, చంద్రకుమారుణ్ణీ పిలిచి, "అబ్బాయిలూ, నేను సూర్యకుమారుడు పుట్టిన సమయంలో మీ పినతల్లికి వరం ఇస్తా నన్నాను. ఆమె ఇప్పుడు రాజ్యం కోరుతున్నది. నేను ఆమెకు రాజ్యం ఇవ్వదలచలేదు. అయితే



స్త్రీబుద్ధి ప్రళయాంతకమైనది. ఆమె మీకు ఏదన్నా కీడు చేయవచ్చు. అందుచేత మీరు వెంటనే అరణ్యాలకు వెళ్ళి, నేను కన్ను మూశాక తిరిగి వచ్చి, ఈ రాజ్యం ఏలుకోండి," అని చెప్పాడు.

ఇదేమీ సూర్యకుమారుడు ఎరగడు. తన అన్నలు రాజభవనం దిగి ఎక్కడికో ప్రయాణం అవుతూ ఉండటం చూసి, అన్నలతోపాటు వెళ్ళాలనిపించి, తాను కూడా వారితో బయలుదేరాడు.

ముగ్గురు అన్నదమ్ములూ హిమాలయాల మీదికి వెళ్ళారు. బోధిసత్వుడు దారికి ఎడంగా ఉన్న ఒక చెట్టు కింద కూర్చుని సూర్యకుమారుడితో, "బాబూ, ఆ కనిపించే కొలనుకు వెళ్ళి, స్నానం చేసి, దాహం తీర్చుకుని, మా ఇద్దరికీ తాగటానికి తామరాకులతో నీరు పట్టుకురా," అన్నాడు.

ఆ కొలను ఒక జలరాక్షసుడైన యక్షుడిది. కుబేరుడు దాన్ని ఆ జలరాక్షసుడికిచ్చి, దేవధర్మం ఎరిగిన వారిని విడిచి పుచ్చమనీ, అది తెలియనివాళ్ళు ఎవరైనా కొలనులో దిగితే వారిని భక్షించమనీ, కొలనులోకి దిగనివారి జోలికి పోవద్దనీ చెప్పాడు.

అది మొదలు ఆ యక్షుడు కొలనులో దిగిన ప్రతి మనిషినీ, "దేవధర్మం ఏమిటి?" అని అడిగి, చెప్పలేని వారిని భక్షిస్తూ వస్తున్నాడు. అందుచేత, సూర్యకుమారుడు కొలనులోకి దిగగానే ఆ యక్షుడు అతన్ని, "నీకు దేవధర్మం తెలుసునా?" అని అడిగాడు.

"తెలుసు; దేవధర్మమంటే సూర్యచంద్రులు," అన్నాడు సూర్యకుమారుడు.

"నీకు దేవధర్మం తెలీదు," అని యక్షుడు సూర్యకుమారుణ్ణి తన నివాసానికి తీసుకుపోయి అక్కడ ఉంచాడు.

సూర్యకుమారుడు ఎంతకూ రాకపోవటం చూసి బోధిసత్వుడు చంద్రకుమారుణ్ణి కొలనుకు పంపాడు. యక్షుడు అతన్ని కూడా పట్టుకుని, "దేవధర్మం

ఏమిటి ?'' అని అడిగాడు. దేవధర్మ మంటే నాలుగు దిశలూ అన్నాడు చంద్ర కుమారుడు. ''నీకు దేవధర్మం తెలీదు,'' అని చెప్పి, యక్షుడు అతన్ని కూడా తీసుకుపోయి తన నివాసంలో ఉంచాడు.

చంద్రకుమారుడు కూడా ఎంతకూ రాకపోయేసరికి బోధిసత్వుడు, ఏదో విపత్తు సంభవించి ఉంటుందనుకుని, తానే స్వయంగా బయలుదేరి కొలనుకు వచ్చాడు. ఇద్దరు మనుషులు కొలనులోకి దిగిన చిహ్నాలు కనిపించాయి గాని, అందులో నుంచి బయటికి వచ్చిన జాడ కనిపించలేదు. ''ఇందులో ఎవరో రాక్షసు డున్నాడు కాబోలు,'' అనుకుని బోధి సత్వుడు కత్తి దూసి చేత పట్టుకుని, యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డాడు.

అతను నీటిలోకి దిగక పోవటం చూసి జలరాక్షసుడైన యక్షుడు ఆటవికుడి రూపంలో అతని ముందుకు వచ్చి, ''మహాశయా, నీటిలోకి దిగి, స్నానం చేసి, దప్పిక తీర్చుకోక, ఒడ్డున ఎందు కిలా నిలబడి ఉన్నారు ?'' అని అడిగాడు.

ఈ కొలనుకు అధిపతి అయిన యక్ష రాక్షసుడు ఈ మనిషే అయి ఉంటాడని బోధిసత్వుడికి అనుమానం కలిగింది. ''నా తమ్ములను పట్టుకుపోయినది నువేనా ?'' అని అతను అడిగాడు.



''అవును, వాళ్ళను పట్టుకుపోయింది, నేనే !'' అన్నాడు యక్షుడు.

''ఎందుకు అలా చేశావు ?'' అని బోధిసత్వుడు అడిగాడు.

''ఈ కొలనులో దిగేవారు నాకు అధీను లవుతారు,'' అన్నాడు యక్షుడు.

''కొలనులోదిగిన ప్రతివాడూ నీకు లోబ డవలసిందేనా ?'' అని అడిగాడు బోధి సత్వుడు.

''దేవధర్మం తెలిసిన వాళ్ళు తప్ప అందరూ నా అధీనంలో ఉంటారు,'' అన్నాడు యక్షుడు.

''నీకు దేవధర్మం కావాలంటే నేను చెప్పగలను,'' అన్నాడు బోధిసత్వుడు.

''అయితే చెప్పు!'' అన్నాడు యక్షుడు ఉత్సాహంగా.

''అభిమానమూ, నిందాభయమూ, శుభకర్మమూ, శాంతమూ గల సత్పురుషుడి ధర్మమే దేవధర్మం,'' అన్నాడు బోధిసత్వుడు.

యక్షుడు ఈ మాటకు తృప్తిపడి, బోధిసత్వుడికి సత్కారాలు చేసి, ''నాకు నీపైన అనుగ్రహం కలిగింది. నీ తమ్ములలో ఒకణ్ణి నీకు తిరిగి ఇస్తాను. ఎవర్ని తీసుకురమ్మన్నావు?'' అన్నాడు.

''నా చిన్న తమ్ముణ్ణి తీసుకురా.'' అన్నాడు బోధిసత్వుడు.

''పండితుడా, నీకు దేవధర్మం తెలుసునేగాని, దాన్ని అమలుపరచటం తెలియదు,'' అన్నాడు యక్షుడు.

''అదేం?'' అని బోధిసత్వుడు అడిగాడు.

''నీ తమ్ములలో పెద్దవాణ్ణి వదిలి చిన్నవాణ్ణి అడగటంలో పెద్దవాడికి గౌరవం లేకుండా చేస్తున్నావు,'' అన్నాడు యక్షుడు.

''యక్షుడా, నేను దేవధర్మాన్ని ఆచరించేవాణ్ణి కనకనే అలా కోరాను. నా చిన్న తమ్ముడి కారణంగానే నేను అరణ్యాలకు రావటం జరిగింది. అతని తల్లి మా తండ్రిని రాజ్యం అడిగింది. మా క్షేమం కోరి మా తండ్రి మమ్మల్ని వనానికి పంపాడు. ఇతను లేకుండా నేను మా దేశానికి పోయి, వాణ్ణి ఎవరో యక్షుడు మింగేశాడంటే ఎవరైనా నమ్ముతారా?'' అన్నాడు బోధిసత్వుడు.

''నీకు దేవధర్మం తెలియటమే కాదు, అనుభవం కూడాను,'' అని యక్షుడు చంద్రకుమారుణ్ణీ, సూర్యకుమారుణ్ణీ తీసుకు వచ్చి బోధిసత్వుడికి ఇచ్చాడు.

కొంతకాలం గడిచాక ముసలిరాజు చనిపోయినట్టు తెలిసింది. బోధిసత్వుడు తన తమ్ములిద్దరితోనూ తన దేశానికి తిరిగి వెళ్ళి, రాజ్యాభిషేకం చేసుకుని, తన తమ్ముడైన చంద్రకుమారుణ్ణి యువరాజుగానూ, సూర్యకుమారుణ్ణి సేనాపతిగానూ నియమించి, రాజ్యపాలన చేశాడు.






మన నదులు :

# తమస

పూర్వం శుక్రాచార్యు డనే గొప్ప ముని, ఒక వనంలో నివసిస్తూండేవాడు. ఆయనకు అరజ అనే కుమార్తె ఉండేది. వారి కుటీరానికి సమీపంలోని తటాకంలో స్నానం చేయడం అంటే అరజకు ఎంతో ఇష్టం.

ఒక రోజు అరజ తటాకంలో స్నానం చేస్తున్నప్పుడు—దండకు డనే రాజు అటు కేసి వచ్చి, పొదచాటున దాగి ఆమె అందచందాలను చూసి ముగ్ధు డయ్యాడు.





అరజ తటాకం నుంచి వెలుపలికి వచ్చాక, దండకుడు ఆమె ముందుకు వచ్చి, ఆమెను తనతో రమ్మనీ, తను ఆమెను వివాహమాడ దలచాననీ చెప్పాడు. అరజ అందుకు అంగీకరించకపోయేసరికి, ఆమెను బలవంతంగా లాక్కుపోవడానికి ప్రయత్నించాడు.



అరజ అతి కష్టం మీద అతని నుంచి తప్పించుకుని, కుటీరానికి పరిగెత్తుకు వచ్చింది. రాజు చేత అవమానింపబడ్డ విషయాన్ని తండ్రికి చెప్పి విలపించింది. మునికి పట్టరాని ఆగ్రహం కల్గింది.

ముని, "ఈ రాజ్యం పాపభూయిష్ఠమయింది. నిస్సహాయులను రక్షించవలసిన రాజే, వారిని పీడిస్తున్నాడు. ఈ రాజ్యంలో—సత్యవంతులూ, సాధువర్తనులూ తప్ప తక్కిన సర్వం నాశనమైపోగాక!" అని శపించాడు.





మునిశాప ఫలితంగా, హఠాత్తుగా అగ్ని జ్వాలలు రాజ్యమంతటినీ చుట్టుముట్టాయి. ముని, వనాన్ని వదిలిపెట్టాడు. ముని కుమారి మాత్రం, అగ్ని చల్లారేవరకు అక్కడి తటాకంలోనే గడిపింది. రాజ్యంలోని నదులూ, తటాకాలూ ఇంకిపోయాయి. కాని, అరజ ఉన్న తటాకం మాత్రం నీళ్ళతో నిండుగా నిలిచింది.

అగ్నిజ్వాలల నుంచి బయటపడ్డవారు, సుదూర ప్రాంతాలకు పారిపోయారు. దండకరాజ్యం బూడిద రాసులతో నిండిపోయి, నిర్మానుష్యమయింది. ఒకటి రెండు పక్షులు తప్ప, ఏ ప్రాణీ దాన్ని సమీపించలేక పోయింది.






చాలా కాలం తరవాత కురిసిన వర్షం కారణంగా, అక్కడి తటాకం ఒక సెలయేరుతో కలిసి నదిగా ఏర్పడింది. ఆ నది ఎడారి లాంటి నేల మీద ప్రవహించసాగింది. పక్షులు తిని రాల్చిన పళ్ళ విత్తుల నుంచి, మొక్కలు పుట్టుకొచ్చాయి. ఆ మొక్కలు మరిన్ని పక్షులను ఆకర్షించసాగాయి.

క్రమక్రమంగా నది కిరువైపులా అరణ్యం ఏర్పడి, దట్టంగా విస్తృతం కాసాగింది. దండకరాజ్యం మీద ఏర్పడడం వల్ల ఆ అరణ్యానికి దండకారణ్యం అనీ, నదికి తమసానది అనీ మునులు పేర్లు పెట్టారు.






భారతదేశంలో దండకారణ్యం సుప్రసిద్ధమయింది. సీతా, రామలక్ష్మణులు వనవాసకాలాన్ని అక్కడే గడిపారు. ఒకవైపు రాక్షసులకూ, పిశాచాలకూ మరోవైపు మునులకూ, సాధువులకూ దండకారణ్యం ఆవాసమయింది.

తమసానది తీరంలోనే ఆదికవి వాల్మీకి తన ఆశ్రమాన్ని నిర్మించుకున్నాడు. ఆ నదీ తీరంలోనే ఆదికావ్యమైన రామాయణ రచన జరిగింది.






తమసానదీ తీరంలోనే సీత తన బిడ్డలైన లవకుశులను పెంచి పెద్ద చేసింది. వాల్మీకి మహర్షి వాళ్ళకు అక్కడే రామాయణ గాథను గానం చేసే విధానం నేర్పాడు. ఈనాటికీ తమసానది దండకారణ్యం గుండా ప్రవహిస్తున్నది!

# విలువైన కానుక

మణిమేఖలరాజు గోకర్ణుడు ప్రతి సంవత్సరం పుట్టిన రోజు వేడుకలు ఘనంగా జరుపుకునే వాడు. ఆ రోజున అందిన కానుకలలో, విలువైన కానుక యిచ్చిన వ్యక్తికి, విందు సమయంలో రాజుగారి సరసన స్థానం ఏర్పాటు చేయబడేది. అది గొప్ప గౌరవంగా భావించిన ఎందరో ధనికులు, రాజుకు విలువైన కానుకలు యివ్వడంలో పోటీపడేవారు.

ఈ పద్ధతి మంచిది కాదని భావించిన సన్యాసి ఒకడు, రాజుకు ఎండిన రొట్టె నొకదాన్ని పంపుతూ, దానితోపాటు ఒక లేఖ జతచేశాడు. అందులో యిలా వున్నది: మహారాజా, మీకు విలువైన కానుకలు యిచ్చుకోలేనివాణ్ణి. అయినా మీపట్ల నాకు కొండంత గౌరవం వున్నది. అందుకే కష్టపడి సంపాయించుకున్న, యీ రొట్టెను ప్రేమతో మీకు యిస్తున్నాను. ఎండు రొట్టే కదా అని తేలిగ్గా చూడకండి; ఇది నా ఒక రోజు ఆహారం!

లేఖ చదివిన రాజుకు తన పొరబాటు తెలిసివచ్చింది. నిండు మనసుతో ప్రేమపూర్వకంగా యిచ్చిన ప్రతి కానుకా విలువైనదే అని అర్థం చేసుకున్నాడు. ఆ రోజు విందు సమయంలో సన్యాసికి, తన పక్కన ఆసనం ఏర్పాటు చేశాడు. —ఎస్. శివనాగేశ్వరరావు





# పగటివేషగాడు

సింహపురి రాజ్యంలో, మల్లయ్యా అనే పగటి వేషగాడు వుండేవాడు. వాడు రకరకాల వేషాలు వేసి, ఆ వేషానికి తగిన హావభావాలూ, సంభాషణా ధోరణీ ప్రదర్శించి ఎందరో పండిత, పామరుల మెప్పుపొందాడు.

ఒకసారి దసరాపండుగకు, ఒక గ్రామంలో యువకుల మధ్య బలప్రదర్శన పోటీలు జరుగుతున్నవి. ఆ సమయంలో అక్కడికి మల్లయ్యా, ఆ దేశపు సేనానాయకుడి వేషంలో వచ్చాడు. గ్రామ పెద్దలు వాణ్ణి చూసి సేనానాయకుడే అనుకుని, భక్తి గౌరవాలతో తీసుకుపోయి, ఉన్నతాసనం మీద కూర్చోబెట్టారు.

పోటీలు ముగిశాక, అందులో గెలిచిన యువకులకు, గ్రామ పెద్దలు మల్లయ్యా చేత బహుమానాలు యిప్పించారు. వాడు ఎంతో హుందాతనం ఒలకబోస్తూ, బహుమతులు పంచిపెట్టి, అక్కడ చేరిన వాళ్ళతో, "పిన్నలూ, పెద్దలూ నన్ను క్షమించాలి. ఈ సమయంలో మన దేశ సేనానాయకుడు యిక్కడ లేకపోవడం, మన దురదృష్టం. ఆయనే గనక, యిప్పుడిక్కడ యువకుల బలప్రదర్శన తిలకించి వుంటే, తక్షణం వీరికందరికీ సైన్యంలో మంచి పదవులు యిచ్చి వుండేవాడు!" అన్నాడు.

ఆ మాటలు విని అక్కడ వున్న వాళ్ళందరూ ఆశ్చర్యపోయారు. అప్పుడు, గ్రామంలోనే కాక, చుట్టుపక్కల కూడా పండితుడుగా పేరు మోసిన ఉదయభట్టు అనే ఆయన, మల్లయ్యా దగ్గిరకు వచ్చి, "నీ పగటివేషం అద్భుతం! నీ పేరేమిటి?" అని అడిగాడు.

మల్లయ్యా తన పేరు చెప్పి, "అయ్యా, నావల్ల ఏమైనా పొరబాటు జరిగి వుంటే

కలిదిండి జయ

క్షమించండి! పండగపూట మీ అందరికీ ఏదో వినోదం కలిగిద్దామని, యీ వేషంలో వచ్చాను,'' అంటూ నమస్కరించాడు.

అయితే, నమస్కరించే ముందు వాడు, తన సేనానాయకుడి వేషం తీసివేశాడు.

ఇందుకు ఉదయభట్టు, మల్లయ్యను చాలా మెచ్చుకుని, ''వేషానికి తగినట్టుగా ప్రవర్తన వుండాలన్న సూత్రం కూడా నువ్వు ఎరుగుదువన్నమాట! ఇంత లోక పరిజ్ఞానం వున్నవాడివి నువ్వు, మన రాజ్యాన్నేలే వీరసేన మహారాజుగారి దగ్గిరకు ఎందుకు వెళ్ళకూడదు,'' అని అడిగాడు.

''నా పగటివేషాన్ని దేశాన్నేలే మహారాజుగారి సమక్షంలో ప్రదర్శించడమా? ఎంతమాట!'' అంటూ మల్లయ్య ఆశ్చర్యపోయాడు.

''అవును, ఎందుకు ప్రదర్శించ గూడదు? మన రాజుగారు గొప్ప కళాపోషకుడు. ఆయన సమర్థులైన కళాకారులను ఘనంగా సత్కరిస్తాడు. నువ్వు, నా మాట విని రాజదర్శనం చేసుకో,'' అని ఉదయభట్టు సలహాయిచ్చాడు.

అంత గొప్ప పండితుడి నుంచి ప్రోత్సాహం రావడంతో, మల్లయ్య ధైర్యం తెచ్చుకుని రాజధానికిపోయి, రాజు వీరసేనుణ్ణి దర్శించి, తను ఆయన సమక్షంలో రెండు వేషాలు ప్రదర్శించ దలుచుకున్నట్టు విన్నవించాడు. రాజు అంగీకారం తెలిపాడు.



మొదటి రోజు మల్లయ్య సన్యాసి వేషంలో రాజు సభచేసి వుండగాపోయి, వేదాంతోపన్యాసం యిచ్చాడు. ఉపన్యాసం మధ్య అక్కడక్కడా సంస్కృత శ్లోకాలు ఉదహరించాడు. రాజుతోపాటు సభికు లందరూ హర్షధ్వానాలు చేశారు.

రాజు వాడికి వంద వరహాలు బహు మానం యివ్వబోయాడు. కాని, మల్లయ్య దాన్ని తీసుకోక ముఖం గంభీరంగా పెట్టి, ''మహారాజా, జీవితం పట్ల విరక్తి చెంది సన్యసించిన నాకు, ధనంతో ఏం పని ?'' అని, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

మర్నాడు నర్తకి వేషంలో రాజసభకు వెళ్ళిన మల్లయ్య, అద్భుతంగా హావ భావాలు ప్రకటిస్తూ చక్కగా నాట్యం చేశాడు. ఈనాడూ సభికులు వాడి విద్యా పాండిత్యాన్ని మెచ్చుకుంటూ హర్షధ్వా నాలు చేశారు. రాజు వాడికి నూరు వర హాలు బహుమానంగా యివ్వబోయాడు.

మల్లయ్య, రాజుకు వినయంగా నమస్క రించి, ''మహారాజా, తమరు గొప్ప కళాభి మానులని వినివచ్చాను. కాని, వంద వరహాల బహుమానం, మీ కళాభిజ్ఞతను కొంచెపరుస్తున్నది. నా విద్యకు తగిన బహూకృతి దయచేయించండి.'' అన్నాడు.

రాజు, వాడి మాటలకు ఆశ్చర్యపోయి, ''నిన్నటి రోజున యివే వంద వరహాలు యివ్వబోతే వద్దన్నావు. ఈ రోజున చాల వంటున్నావు. నీ ప్రవర్తన ఆశ్చర్యంగా వున్నది,'' అన్నాడు.

దానికి మల్లయ్య, ''నిన్నటి నా వేషం సన్యాసిది. దానికి తగినట్టుగా వేదాంత ధోరణీ, వైరాగ్యభావం ప్రదర్శించాను. ఈ రోజున నాది నర్తకివేషం. నర్తకికి సహజంగా ప్రాపంచిక విషయాలపట్ల ఆసక్తి, ధనం అంటే తీరని దాహం వుంటుంది. వేషానికి తగిన ప్రవర్తన అవసరం కదా, ప్రభూ!'' అన్నాడు.

రాజు వాడి మాటలకు పరమానందం చెంది, ఐదువందల వరహాలు బహుమా నంగా యిచ్చాడు.





# శిలావిగ్రహం

కోట్లకు పడగలెత్తిన వజ్రగుప్తుడనే వర్తకుడికి ఇద్దరు భార్యలు. పెద్ద భార్య కూతురు వాసంతి; చిన్న భార్య కూతురు పద్మావతి. ఇద్దరూ ఇంచుమించు ఒకే వయసువాళ్ళు. వాళ్ళ స్వభావాలు మాత్రం పూర్తిగా భిన్నం. వాసంతి చాలా కఠినురాలు. ఎదుటివారి గొప్పతనాన్నీ, సుఖాన్నీ చూసి ఆమె ఓర్వలేదు. తన నౌకర్లనూ, చాకర్లనూ హింసించి ఆనందించేది.

ఈ కారణాలవల్ల, ఇంట్లో అందరూ పద్మావతిపట్ల ఎక్కువ ప్రేమగా వుండేవారు. విశేషమేమంటే, ఆ అక్కచెల్లెళ్ళిద్దరివీ యించుమించు ఒకే రూపురేఖలు. తెలియనివాళ్ళు చటుక్కున ఎవరెవరో తెలియక పొరబడేవారు. తెలిసినవాళ్ళు కూడా, వాళ్ళ స్వభావాల్లోని తేడాలవల్ల వెంటనే గుర్తుపట్టగలిగేవాళ్ళు.

ఆ ఇద్దరిలో వాసంతి కొద్ది రోజులు పెద్దది. తనెంత స్వార్థపరురాలైనా, కఠినురాలైనా, వాసంతి తను చాలా మంచిదాన్నని అనుకునేది. తనవంటి భాగ్యవంతులు హుందాగా, కఠినంగా ప్రవర్తించడమే సహజమని ఆమె అభిప్రాయం. అయితే, తనకు చెడ్డ పేరు వస్తున్నదనీ ఆమెకు తెలుసు. అందుక్కారణం పద్మావతి అని ఆమె నమ్మకం. పద్మావతి చేసే మంచి పనులన్నీ, తనకు చెడ్డ పేరు తేవడం కోసమేనని భావించి, రోజూ చెల్లెలితో గొడవపడేది.

అయితే, పద్మావతి మాత్రం ఆమెతో, "ఎందుకే అక్కా, రోజూ గొడవ చేస్తావు? మనం సఖ్యంగా వుంటేనే, నలుగురూ మనను గౌరవిస్తారు," అనేది.

"అందరి గౌరవం సంగతీ అట్టావుంచు. ముందు నువ్వు, నన్ను గౌర

జొన్నలగడ్డ రామలక్ష్మి



వించు. నువ్వూ, నాలాగే ప్రవర్తించు," అనేది వాసంతి.

వాసంతి లాగా వుండడం పద్మావతికి సాధ్యం కాదు; పద్మావతి లాగా వుండడం వాసంతికి సాధ్యం కాదు. అందువల్ల, క్రమంగా వాసంతికి, పద్మావతి మీద ద్వేషం పెరిగిపోసాగింది.

ఇలా వుండగా వాళ్ళింటికి చంద్రకాంతుడనే శిల్పి వచ్చాడు. వజ్రగుప్తుడు తన ఇంటి ఆవరణలో, ఒక కళామందిరాన్ని నిర్మించి, అందులో చక్కటి శిల్పాలను ప్రతిష్ఠించాలనుకున్నాడు.

చంద్రకాంతుడు యువకుడు; గొప్ప కళాకారుడు. అతడు తనకు నియమించబడిన పనిని శ్రద్ధగా చేసుకుపోయేవాడు. వాసంతీ, పద్మావతీ అతడు శిల్పాలు చెక్కుతూంటే రోజూ చూడబోయేవారు. ఇద్దరూ అతణ్ణి మాటల్లోకి దించి, శిల్ప విద్య గురించి అడిగి తెలుసుకుంటూండే వారు. ఆ అడగడంలో కూడా తేడా వుండేది!

పద్మావతి, చంద్రకాంతుణ్ణి వినయంగా అడిగేది. వాసంతి యజమానిలా విపరీతంగా అహంకరించేది. చంద్రకాంతుడు వాళ్ళ ధోరణులు పట్టించుకోకుండా, ఇద్దరికీ ఒకేరకంగా సమాధానాలిచ్చేవాడు.

ఇది వాసంతికి విచిత్రంగా తోచేది. పద్మావతితో అభిమానంగానూ, కుతూహలంగానూ మాట్లాడే వాళ్ళందరూ, వాసంతితో భయంభయంగా మాట్లాడేవారు. చంద్రకాంతుడు తనను గురించి ఏమనుకుంటున్నాడో తెలుసుకోవాలని, ఆమె పద్మావతి లేని సమయంలో అతడి దగ్గిరకు వెళ్ళసాగింది.

ఒకనాడు చంద్రకాంతుడు, వాసంతి ఆశ్చర్యపడేలా, "మీ అక్కచెల్లెళ్ళలో నువ్వంటేనే, నాకెక్కువ యిష్టం," అన్నాడు.

వాసంతి ఆ మాట నమ్మక, "నువ్వు అబద్ధం చెబుతున్నావు," అన్నది.

"అబద్ధం చెప్పవలసిన అవసరం, నాకు లేదు," అన్నాడు చంద్రకాంతుడు.

వాసంతి అతడి కేసి చురచుర చూస్తూ, "నువ్వు, మా దగ్గిర డబ్బు తీసుకుని పని చేయడానికి వచ్చినవాడివి. మేము యజమానులం; నువ్వు పనివాడివి. నీతో నేను మాట్లాడేపద్ధతి సహజం. కాని, పద్మావతి నువ్వే యజమానివైనట్టూ, తను సేవకురాలన్నట్టూ మాట్లాడుతుంది. పనివాళ్ళకు అలా మాట్లాడేవాళ్ళంటేనే యిష్టముంటుంది," అన్నది.



చంద్రకాంతుడు ఎంతో తాపీగా, "అ మాట నిజం కాదు. నువ్వు అందగత్తెవు. అహంకారం, నీ అందాన్ని మరింతగా పెంచింది. నేను, నీ అందానికి దాసుడనై పోయాను. నాకు నువ్వేమన్నా బావుంటుంది. ఎందుకంటే, నేను, నిన్ను ప్రేమిస్తున్నాను," అన్నాడు.

వాసంతికి కోపం వచ్చింది. "నేను, నాకంటే గొప్పవాడిని ప్రేమిస్తాను తప్పితే, నీలాంటి పేదవాణ్ణి ప్రేమించనని తెలియదా?" అన్నదామె.

"నాకు తెలుసు. కాని, నా ప్రేమకు తెలియదు," అన్నాడు చంద్రకాంతుడు.

ఇన్నాళ్ళకు తన చెల్లెల్ని కాదని, తనను ప్రేమించే మనిషి ఒకడు దొరికాడని వాసంతికి ఆనందం కలిగింది. అందువల్ల, ఆమె తరచూ చంద్రకాంతుణ్ణి చూడవచ్చి, అతణ్ణి తక్కువచేసి మాట్లాడేది.

"ఎందుకు నన్నిలా తక్కువ చేస్తావు?" అని చంద్రకాంతుడు బాధగా ఆమె నొకసారి అడిగాడు.

"పేదవాళ్ళు, గొప్పవాళ్ళను పొగడడం ఎంత సహజమో, గొప్పవాళ్ళు, పేదవాళ్ళను హీనపరచడమూ అంతే సహజం," అని వాసంతి చంద్రకాంతుడికి చెప్పి, "నువ్వు, నన్ను ప్రేమిస్తే ప్రేమించు గానీ, పెళ్ళి గురించి మాత్రం ఆశలు పెట్టుకోకు," అన్నది.

ఇలాంటి సమయంలో ఒకసారి పద్మావతి, రామాపురం అనే గ్రామంలోని తమ



బంధువుల్ని చూడబోయింది. అక్కడ రెండేళ్ళుగా వానలు లేక గ్రామస్థులు నీటికి చాలా యిబ్బంది పడుతున్నారు.

ఈ సంగతి తెలుసుకుని పద్మావతి బంధువులతో, ''బావులు తవ్విస్తే, కొంతలో కొంత నీటి ఎద్దడి తగ్గుతుంది గదా ?'' అన్నది.

''చాలా ప్రయత్నాలు చేశాం. ఎక్కడా జలఊరడంలేదు," అన్నారు బంధువులు.

అప్పుడొక అద్భుతం జరిగింది!

ఉన్నట్టుండి పద్మావతికి భూమిలోపలి విలువైన నిక్షేపాలూ, నీటి ప్రవాహాలూ కనిపించసాగాయి. ఆమె గ్రామమంతా తిరిగి, ఎక్కడెక్కడ నిక్షేపాలున్నదీ, జల ఊరేదీ గ్రామస్థులకు చెప్పింది. వాళ్ళకు నమ్మకం కలగకపోయినా, ప్రయత్నించి చూసేసరికి, ఆమె చెప్పినట్టే జరిగింది. గ్రామంలో నీటి సమస్య తొలగిపోవడమే గాక, అందరివద్దా యింతో అంతో బంగారం సమకూరింది.

గ్రామస్థులకు కలిగిన సంతోషం అంతా యింతా కాదు. వాళ్ళంతా ఒకచోట కూడి, ''ఈ పద్మావతి సామాన్యమానవకాంత కాదు; దేవకాంత! గ్రామంలో ఈమె శిలా విగ్రహం ఒకటి ప్రతిష్ఠించామంటే, మన గ్రామానికి ఎన్నటికీ కరువుండదు!'' అనుకున్నారు.

ఆ తరవాత గ్రామ పెద్ద, వజ్రగుప్తుణ్ణి కలుసుకుని తమ కోర్కె వెల్లడించాడు.

వజ్రగుప్తుడు చాలా సంతోషించి, ''బతికుండగా శిలావిగ్రహం ప్రతిష్ఠ చేయించుకునే అదృష్టం, ఎందరికో కావాలన్నా కలగదు,'' అనుకుని, విగ్రహం తయారు చేసే పనిని చంద్రకాంతుడికే అప్పగించాడు.

సంగతి విన్న వాసంతికి, చెల్లెలి మీద భరించరానంత అసూయాద్వేషాలు కలిగినై. ఆమె డబ్బు కోసం ఏమైనా చేయగల కొందరు దుష్టులను పోగుచేసింది. రెండు నెలల తర్వాత రామాపురంలో పద్మావతి శిలావిగ్రహం ప్రతిష్ఠింపబడగానే, వాళ్ళు

గ్రామంలో దొంగతనాలూ, కొట్లాటలూ ప్రారంభించారు.

వాళ్ళల్లో ఒకడు బైరాగి వేషంతో గ్రామంలో తిరుగుతూ, ఈ గొడవలన్నిటికీ మూలకారణం ప్రతిష్ఠ చేసిన శిలావిగ్రహమనీ, అది గ్రామానికి అరిష్టదాయకమనీ చెప్పసాగాడు. దానితో గ్రామంలో పెద్ద కలకలం రేగింది.

వజ్రగుప్తుడు విషయం తెలుసుకుని చాలా బాధపడ్డాడు. ఆయన చంద్రకాంతుడి గురువైన శిల్పాచార్యుడి వద్దకు పోయి, "ఆర్యా, తమరు పంపారు గదా అని, నేను చంద్రకాంతుడి ప్రతిభను నమ్మి, నా కళామందిర శిల్పాల బాధ్యత అతడికి అప్పగించాను. కాని, అతడి శిల్పాలు లోపభూయిష్ఠాలూ, అరిష్టదాయకాలూ అని, యిప్పుడు నా కనిపిస్తున్నది. ఎందుకంటే, నా కూతురు పద్మావతి సుగుణాలరాశి. దాని శిల్పం అరిష్టాలకు కారణం అయిందంటే, లోపం శిల్పం చేయడంలో వుండి వుండాలి!" అన్నాడు.

శిల్పాచార్యుడా మాటలకు ఆశ్చర్యపోయి, "చంద్రకాంతుడు, నా శిష్యుల్లోకెల్లా ఉత్తముడు, ప్రతిభావంతుడు. అతడి శిల్పాల్లో లోపాలుండడం, ఆశ్చర్యం కలిగిస్తున్నది," అని, ఆయన అప్పటి కప్పుడు బయలుదేరి, పద్మావతిని తీసు



కుని రామాపురానికి వచ్చి, "వజ్రగుప్తా, నువ్వు చెప్పింది నిజం. ఈ శిల్పంలో లోపం వున్నది. పద్మావతి రూపానికీ, ఈ శిల్పానికీ కొన్ని తేడాలున్నవి," అన్నాడు.

వెంటనే చంద్రకాంతుడి కోసం కబురు పంపారు. చంద్రకాంతుడు రాగానే శిల్పాచార్యుడు అతడి కేసి తీవ్రంగా చూస్తూ, "నీవు, గురువునైన నాకు మరింత కీర్తి తేగలవనుకున్నాను. కాని, శిల్పాలను యింత లోపభూయిష్ఠంగా తయారు చేస్తావనుకోలేదు!" అన్నాడు.

చంద్రకాంతుడు వినయంగా గురువుకు నమస్కరించి, "ఆర్యా, లోపం నా శిల్ప విద్యదికాదు; నాదే! నే చెక్కినది పద్మా

వతి శిలావిగ్రహం కాదు—వాసంతిది,'' అన్నాడు.

''అలా ఎందుకు చేశావు?'' అని అడిగాడు శిల్పాచార్యుడు కోపంగా.

''తన చెల్లెలి శిలావిగ్రహం ప్రతిష్ఠించబడుతున్నందుకు, వాసంతికి అసూయగానూ, బాధగానూ వున్నది. నేనామెను ప్రేమిస్తున్నాను. అక్క చెల్లెళ్ళిద్దరికీ రూపాల్లో ఎంతో భేదం లేదు కాబట్టి—ఎవరికీ తెలియదనుకుని, నేను వాసంతి విగ్రహాన్ని తయారు చేశాను. ఈ సంగతి వాసంతికి కూడా చెప్పలేదు. కాని, అసూయాపరుల విగ్రహ ప్రతిష్ఠ, గ్రామానికి అరిష్టం కలిగిస్తుందని గ్రహించలేకపోయాను. క్షమించండి!'' అంటూ చంద్రకాంతుడు గురువు పాదాలకు ప్రణమిల్లాడు.

జరిగిన సంగతి వాసంతికి తెలిసింది. తన అసూయే అందరిలో తనకు చెడ్డ పేరు తెచ్చిందని ఆమె గ్రహించి, పద్మావతి దగ్గిరకు వెళ్ళి, ''చెల్లీ, నేను అసూయాద్వేషాలను వదిలి సన్మార్గంలో నడవకపోతే, దేశానికే అరిష్టం కాగలనన్న భయం కలుగుతున్నది. ఈ రోజు నుంచీ నువ్వు చెప్పినట్టు వింటాను. నన్ను సన్మార్గంలో నడిపించు,'' అన్నది.

కూతురి ప్రవర్తనలో వచ్చిన మార్పుకు వజ్రగుప్తుడు చాలా సంతోషించి, చంద్రకాంతుణ్ణి క్షమించాడు. అంతేకాక, వాసంతి కఠినాత్మురాలని తెలిసీ, ఆమెను ప్రేమించగలిగిన అతడికి ఆమె నిచ్చి వివాహం కూడా చేశాడు.

చంద్రకాంతుడితో వివాహం అయాక, వాసంతి దగ్గర వుండి భర్త చేత పద్మావతి శిలావిగ్రహాన్ని తయారు చేయించి, రామాపురంలో ప్రతిష్ఠింపచేసింది.

వాసంతిలో వచ్చిన మంచి మార్పుకు చంద్రకాంతుడే కారణం అని గ్రహించిన వాళ్ళందరూ, ''చంద్రకాంతుడు మనుషులను శిలావిగ్రహాలుగా మలచడమే కాదు, శిలావిగ్రహాలను మనుషులుగా మార్చగలడు!'' అని చెప్పుకున్నారు.






# ఉప్పుకషాయం

ఒక గ్రామంలో ఒక ఆసామీ ఉండేవాడు. ఆయన కొక కొడుకూ, కూతురూ ఉండేవారు. కాలక్రమాన కొడుకుకు పెళ్ళి అయి కోడలు కాపరానికి వచ్చింది. దాంతో ఇంట్లో ముగ్గురు ఆడవారయారు—ఆసామి భార్యా, కూతురూ, కోడలూ.

ముగ్గురాడవాళ్ళు ఒక కొంపలో ఉన్నప్పుడు కొంపలో ఏదో ఒక అవకతవక జరుగుతూనే ఉంటుంది. ఈ ఇంట్లో ఇద్దరాడవాళ్ళు తల్లీ కూతుళ్ళే గనక వారిద్దరి పద్ధతులూ ఇంచుమించు ఒకటిగానే ఉండేవి. పోతే కోడలు పరాయిపిల్ల. ఆమె అలవాట్లు వేరు, ఆమె పనులు చేసే తీరు కూడా వేరే. అందుచేత ఆ పిల్లను తమ పద్ధతులకు మార్చటానికి తల్లీ కూతుళ్ళు చాలా శ్రమపడుతూ ఉండేవారు. కోడలు గనక ఆమెకు ఒకటి రెండుసార్లు చెప్పినా తెలియదన్నట్టు కూడా భావించి, చెప్పిన విషయాలే మళ్ళీ మళ్ళీ చెబుతూండేవారు.

ఒక రోజు ఆసామి బావమరిది చుట్టపుచూపుగా వచ్చాడు. అవకతవకలు జరిగితే తన అన్న ఏమనుకునిపోతాడో అని ఆసామి భార్య ప్రత్యేకంగా జాగ్రత్తపడసాగింది. ఆవిడ బిందె తీసుకుని బావికి వెళుతూ కోడలితో, "ఏమే, పొయి మీద పులుసు కాగుతున్నది గాని, అందులో గుప్పెడు ఉప్పు వెయ్యి. మళ్ళీ మరచిపోగలవు, జాగర్త!" అని వెళ్ళింది.

రెండు రోజులక్రితం కోడలు పులుసులో ఉప్పు వెయ్యటం మరిచిపోయింది. ఆ సంగతి కోడలికి జ్ఞాపకం చేసే ఉద్దేశంతో అత్తగారు అలా అన్నది.

చేతిలో పని అయిపోగానే కోడలు పులుసు కళాయిలో ఇంత ఉప్పు వేసి వేరే పని చూసుకోబోయింది.

మరి కాస్సేపటికల్లా ఆడబిడ్డ పిడకలు గోడకు కొట్టటం ముగించి చేతులు కడుక్కుని వంటయింట్లోకి వచ్చి పొయి మీద కాగుతున్న పులుసు చూసింది.

''ఆ తెలివితక్కువ మొద్దు ఎలాగూ పులుసులో ఉప్పు వెయ్యటం మరిచి పోతుంది. ఆవిడ తరహా నాకు తెలుసు! మామయ్య వచ్చాడు కూడానూ!'' అనుకుని ఆమె ఒక పిడికెడు ఉప్పు తీసి పులుసులో వేసి గొడ్లకు మేత వెయ్య బోయింది.

ఇంతలో అత్తగారు నీళ్ళ బిందెతో తిరిగి వచ్చి పొయి మీద పులుసు చూసి, ''ఆ మొద్దుకు మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం చెయ్యటం కంటె నేనే చేసుకోవటం నయం!'' అంటూ ఒక గుప్పెడు ఉప్పు తీసి పులుసులో వేసేసింది.

మధ్యాహ్నం ఆసామీ, ఆయన బావ మరిదీ భోజనాలకు కూర్చున్నప్పుడు, బావమరిది ముందుగా పులుసు ముద్ద నోట్లో పెట్టుకుని, ''ఇదేమిటర్రా, ఇందులో ఉప్పు వెయ్యటం మరిచారా ఏమిటి?'' అన్నాడు.

వెంటనే ఆసామి భార్య, ''అదేమిటన్నయ్యా, నేను పులుసులో ఉప్పు వేశానే?'' అన్నది ఆశ్చర్యంగా.

వెంటనే కూతురు, ''నేను పిడికెడు ఉప్పు వేశానమ్మా!'' అన్నది.

''మీరు ఉప్పు వెయ్యటం మరవద్దన్నారుగా, అందుకని నేనూ వేశానత్తయ్యా!'' అన్నది కోడలు.

''అలా చెప్పండి! అందుకే పులుసు ఉప్పుకషాయమయింది!'' అన్నాడు ఆసామి బావమరిది నవ్వుతూ.

ఇంటి ఆడవాళ్ళమధ్య ఐక్యత లేక పోవటం చూసి ఆసామికి కోపం వచ్చింది.

''ఇకనుంచీ ఈ ఇంట్లో మీరు ఎవరి పనులు వారు చేసుకోవలసిందే గాని, ఒకరి పనులు ఒకరు చెయ్యటానికి వీల్లేదు!'' అని శాసించాడు.

అంతటితో ఆ ఇంట జరిగే అవకతవకలు అన్నీ నిలిచిపోయాయి.






రతీదేవి ప్రార్థన ఆలకించి శివుడు ఆమెతో, "మన్మథుడు బ్రహ్మ శాపం కారణంగా భస్మమయాడు. అతను బ్రహ్మను కూడా ఇలాగే పూలబాణాలతో కొట్టి ఆయనకు కుమార్తెపై మోహం రేకెత్తించి, శాపం పొందాడు. కాని నీ పాతివ్రత్యానికి భంగం రానివ్వను. అతను లోకానికి శరీరం లేనివాడైనప్పటికీ, నీకు మటుకు శరీరంతోనే కనిపిస్తాడు. అతనికి ఇప్పుడే ప్రాణం ఇస్తాను," అన్నాడు.

తరవాత శివుడు తపస్సు మాని కైలాసంలో తన రుద్రగణాలతో కొలువుతీరి, అగ్నిని పిలిచి, "అగ్నీ, ఇకముందు నువు వృక్షాలలోనూ, పర్వతాలలోనూ, సముద్రంలోనూ కనబడకుండా దాగి ఉండు," అని ఆదేశించాడు.

దేవేంద్రుడూ, దేవతలూ శివుడి వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయారు. శివుడి మనస్సు పార్వతిపై లగ్నమయింది. ఆయన పార్వతిని వివాహమాడ నిశ్చయించుకున్నాడు.

శివుడు వనాన్నీ, మన్మథుణ్ణీ భస్మం చేయటం కళ్ళారా చూసిన పార్వతి భయపడి తన చెలికత్తెలతో సహా పరిగెత్తుకుంటూ ఇంటికి తిరిగి వచ్చింది. జరిగినదంతా విని మేనకా హిమవంతులు తమ కుమార్తె పునర్జన్మ ఎత్తినట్టే భావించుకున్నారు. వాళ్ళు పార్వతిని ఊరడించి ఆమె భయం పోగొట్టారు.

## 5. పార్వతి తపస్సు



పార్వతీ మటుకు శివుడి కోసం విరహం చెంది బాధపడసాగింది. ఆమెకు శివుడి ధ్యాస తప్ప మరొకటి లేదు. శివుడి కోసం నిద్రాహారాలు మాని తపించే తమ కూతురితో మేనకా హిమవంతులు. "నీకూ శివుడికీ త్వరలోనే పెళ్ళి చేస్తాం, నువ్వు ఏ మాత్రం విచారించకు," అని ఎంతగానో నచ్చ చెప్పారు.

ఒకనాడు నారదుడు వచ్చి పార్వతితో, అమెను శివుడు పెళ్ళాడతాడని ధైర్యం చెబుతూ, శివపంచాక్షరీ మంత్రం ఉపదేశించి, దాన్ని జపించినట్టయితే ఎలాంటి కోరికలైనా తీరుతాయనీ, సమస్త సుఖాలూ కలుగుతాయనీ చెప్పి, మేనకా హిమవంతుల వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

తరవాత పార్వతి శివపంచాక్షరీ మహా మంత్రాన్ని జపించుతూ, శివధ్యానంలో నిమగ్నురాలయింది.

నారదుడు చెప్పిన ప్రకారం పార్వతి తన చెలికత్తెలను వెంట బెట్టుకుని శృంగ తీర్థానికి వెళ్ళి, పంచాక్షరీ మహా మంత్రం జపిస్తూ తీవ్రమైన తపస్సు చేయసాగింది. అమె ఒక్క ఆకు కూడా తినకుండా తపస్సు చేస్తూ ఉండటం చూసి, అక్కడి మునులు ఆమెను "అపర్ణ" అని పిలవనారంభించారు.

ఒకనాడు మేనకా హిమవంతులు తమ కుమార్తెను చూడ వచ్చి, ఆమె శుష్కించి ఉండటం చూసి భయపడి, "అమ్మా, ఆహారం కూడా మాని ఎందుకు ఈ ఘోర తపస్సు చేస్తున్నావు? మన్మథుణ్ణి మసి చేసిన శివుడు నీపట్ల అనుగ్రహిస్తాడా? అతను విరాగీ, దయాహీనుడూ, ముక్కోపీను. అందని పండుకు ఎందుకు ఆశిస్తావు? ఇంటికి వచ్చెయ్యి." అన్నారు.

పార్వతి ఈ మాటలు విని, "మీరు మొదట నాతో ఏమన్నారు? శివుడికి నన్నిచ్చి పెళ్ళి చేస్తామనలేదా? నా తపస్సుతో నేను ఆయనను మీ అల్లుడుగా చేస్తాను. నా కోసం ఏ మాత్రం దిగులు

పడక. మీరు ఇంటికి వెళ్ళి, సుఖంగా వుండండి." అని తన తల్లిదండ్రులతో అన్నది.

ఈ లోపుగా శివుడు పార్వతిని ఎలా పెళ్ళాడటమా అని మథనపడి పోతు న్నాడు. అప్పుడు బ్రహ్మ, విష్ణు, దేవేంద్రాదులు శివుడి వద్దకు వచ్చి, అతనివల్ల మర్యాదలు పొంది, "మహేశ్వరా, నువు పార్వతిని పెళ్ళాడి లోకాలకు మేలు చెయ్యాలెందుకు? నీకు పుట్టిన కొడుకు చేత తప్ప చావు లేకుండా తారకుడు వరం పొంది ఉన్నాడు. వాడు చస్తేనేగాని లోకాలు సుఖపడవు." అన్నాడు.



ఈ మాటలకు శివుడు లోపల సంతోషించి కూడా, పైకి వారితో, "పెళ్ళాడితే తపస్సు సాగదు. మన్మథుణ్ణి జయించవచ్చుగాని, స్త్రీల చూపుల బాణాలకు తట్టుకోవటం కష్టం. పార్వతితో గృహస్థాశ్రమం గడపటం కన్న తపస్సు చేసుకోవటమే మంచి దనుకుంటున్నాను." అన్నాడు.

ఇందుకు బ్రహ్మ మొదలైనవారు ఒప్పుకోక, గృహస్థాశ్రమమే గొప్పదనీ, భార్య లేనివాణ్ణి ఎవరూ గౌరవించరనీ, శివుడు గృహస్థుగా ఉంటూనే తపస్సు చేసి, రాజయోగిగా జీవించటం వల్ల లోకాలకు మేలు కలుగుతుందనీ హెచ్చరించారు.

వారు చెప్పినట్టే చేస్తానని మాట ఇచ్చి శివుడు బ్రహ్మ మొదలైన వారిని పంపేశాడు. కాని, అతనికి పార్వతిపై విరహం ఉన్నప్పటికీ, పార్వతి మనస్సు స్వయంగా తెలుసుకోవాలనిపించింది. అందుచేత ఆయన ముసలి యతి రూపం దాల్చి, దండమూ, కమండలమూ ధరించి పార్వతి తపస్సు చేసుకుంటున్న చోటికి వెళ్ళాడు. పార్వతి ఆయన తేజస్సు చూసి, బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో ఒకడై ఉంటాడనుకుని, ఆయనను పూజించి, స్వాగతమిచ్చి, "తమరు ఎవరు? నేను తపస్సు చేసుకుంటున్న ఈ తీర్థప్రాంతానికి ఎందుకు వచ్చారు?" అని అడిగింది.



తరవాత నారదుడు పంచాక్షరీ మంత్రం ఉపదేశించగా, ఆ మంత్రాన్ని జపిస్తూ, శివుణ్ణి భర్తగా పొందటానికి ఇక్కడ తపస్సు చేస్తున్నాను. ఇంతగా తపస్సు చేసినా శివుడికి ఇంకా నా పైన అనుగ్రహం కలగలేదు. అందుచేత అగ్ని ప్రవేశం చేసి ఈ దేహం చాలింతామనుకుంటున్నాను.'' అని చెప్పింది.

శివుడు ఆమెతో, ''నువు చాలా పొరపాటు చేసున్నావు. ఈశ్వరుడు విరాగి. తపస్సు చేసుకునేవాడు. నువు నీ తపస్సుతో లోకాలకు ప్రమాదం కలిగించేకన్న ఇంటికి తిరిగి వెళ్ళి దేవతలలో ఒకణ్ణి వివాహం చేసుకోవటం మంచిది,'' అన్నాడు.

''ఇక మీరు వెళ్ళవచ్చు. నేను నా అభిప్రాయం మార్చుకోను,'' అన్నది పార్వతి చిరాకుపడి.

''అలాగే వెళతాను. కాని, వెళ్ళే ముందు నీకు కొంత హితం చెప్పాలి. శివుడు దరిద్రుడు, పట్టుబట్టలు కట్టడు, చర్మాలు ధరిస్తాడు. ఎక్కి తిరగటానికి ఎద్దు తప్ప మంచి వాహనం లేదు. దయ్యాలనూ, భూతాలనూ వెంట వేసుకు తిరుగుతాడు. ఒంటికి గంధం పూసుకోడు, బూడిద పూసుకుంటాడు. అతన్ని పెళ్ళాడి ఏం సుఖపడతావు?'' అన్నాడు శివుడు.

''నేను బ్రహ్మవంశానికి చెందినవాణ్ణి. లోకాల క్షేమం చూస్తూ ముల్లోకాలు తిరుగుతూ ఉంటాను. నువు ఎవరి కుమార్తెవు? దేని కోసం ఇలా కఠోర తపస్సు చేస్తున్నావు?'' అని శివుడు ఆమెను చిరునవ్వుతో అడిగాడు.

పార్వతి ఆయనతో, ''నేను మేనకా హిమవంతుల కుమార్తెను. నన్ను పార్వతి అని పిలుస్తారు. ఈశ్వరుడు కైలాసం మీద తపస్సు చేస్తూ ఉంటే నేను ఆయనకు పరిచర్యలు చేస్తూ ఉండేదాన్ని. అప్పుడు ఒకనాడు మన్మథుడు ఆయనను తన పంచబాణాలతో కొట్టేసరికి, ఆయన మన్మథుణ్ణి తన ఫాలాగ్నితో దహించాడు.

పార్వతికి తీవ్రంగా కోపం వచ్చింది. ''నువు దొంగయతివి. జ్ఞానివని భ్రమ పడ్డాను. శివుడు అష్టఐశ్వర్యాలు గలవాడు. శివదూషణ చేసినవారు ఏడు జన్మల పాటు దరిద్రం అనుభవిస్తారు,'' అని తన పరిచారికలను పిలిచి, ''ఈ యతిని అవతలికి గెంటండి,'' అన్నది.

శివుడు నవ్వి, ''పార్వతీ, నేను శివుణ్ణే. నీ మనసు తెలుసుకుందామని యతి వేషంలో వచ్చాను. నీ ఎడబాటుతో చాలా బాధపడుతున్నాను. నా వెంట కైలాసానికి వచ్చెయ్యి.'' అన్నాడు పార్వతి చెయ్యి పట్టుకుని.



శివుని చేయి విడిపించుకొని చూసే సరికి పార్వతి కళ్ళకు అసలు శివుడే కనిపించాడు. ఆమె ఆయనకు క్షమాపణ చెప్పుకుని, ''ఇలా నీ వెంట రావటం భావ్యం కాదు. నా తల్లిదండ్రుల అనుమతి పొంది, నన్ను వివాహం చేసుకుని, నీ వెంట తీసుకువెళ్ళు,'' అన్నది.

ఆమె శివుడికి నమస్కరించి, తన పరిచారికలతో సహా తన ఇంటికి వెళ్ళి పోయింది. మేనకా హిమవంతులు జరిగిన సంగతి తెలుసుకుని ఎంతో సంతోషించి, పార్వతి వివాహానికి మంచి ముహూర్తం నిశ్చయించి, పెళ్ళిప్రయత్నాలు ప్రారంభించారు.

శివుడు కూడా కైలాసానికి తిరిగిపోయి, ప్రమథ గణాలతో, మన్మథుడు తనను పూలబాణాలతో కొట్టినది మొదలు తన మనసు పార్వతి మీద లగ్నమై, తపస్సు మీదికి పోవటం లేదనీ, పార్వతిని వివాహం చేసుకోగోరుతున్నాననీ, అందుకు సప్త మహర్షుల మధ్యవర్తిత్వం కావాలనీ అన్నాడు.

వెంటనే నందీశ్వరుడు అక్కడి నుంచి బయలుదేరి వెళ్ళి, సప్త మహర్షులను వెంట బెట్టుకుని త్వరలోనే కైలాసానికి తిరిగి వచ్చాడు.

వాళ్ళు శివదర్శనం కలిగినందుకు సంతోషించి, ''మా వలన కావలసిన



కార్యమేమిటో సెలవిస్తే, చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాము," అన్నారు.

"మహా మునులారా, నేను పార్వతిని వివాహం చేసుకుని, గృహస్థుగా ఉండ నిశ్చయించాను. అందుచేత మీరు మేనకా హిమవంతుల వద్దకు వెళ్ళి, వారి కుమార్తె అయిన పార్వతిని నా కిచ్చి పెళ్ళి చేసే లాగు మంచి మాటలతో ఒప్పించి, ముహూర్తం పెట్టి నా వివాహం జరిపించండి," అన్నాడు శివుడు సప్తమహర్షులతో.

సప్తమహర్షులు అందుకు సంతోషంగా ఒప్పుకుని హిమవంతుడు ఉండే చోటికి వచ్చారు. మేనకా హిమవంతులు వారికి ఆదరంతో అతిథి సత్కారాలు చేసి, "ఏ పని మీద మీరు మా గృహం పావనం చేశారో సెలవిస్తే, మీరు చెప్పినది చేస్తాం," అన్నారు.

దానికి సప్తమహర్షులు, "మేనకా హిమవంతులారా! మీ అదృష్టం చాలా గొప్పది. సాక్షాత్తూ పరమేశ్వరే మీ కడుపున పార్వతిగా పుట్టింది. ఆమెను శివుడు ఇప్పుడు వివాహమాడ గోరుతున్నాడు. ఈ పెళ్ళితో మీ కీర్తి ముల్లోకాలు వ్యాపిస్తుంది," అన్నారు.

ఆ మాటలు విని మేనకా హిమవంతులు, "మహర్షులారా, మేము కూడా పార్వతిని శివుడికి ఇచ్చి పెళ్ళి చేయాలనే అభిప్రాయంతోనే ఉన్నాము. కాని నిన్న ఒక భిక్షువు మా వద్దకు వచ్చి, పార్వతిని శివుడికి ఇయ్యవద్దనీ, శివుడికి ఒక రాజ్యం గానీ, సుఖం గానీ, భోగం గాని లేవనీ, శ్మశానాలలో నివసిస్తాడనీ, పాములను ధరించి, సరి అయిన భోజనపాత్ర కూడా లేక కపాలంలో తిండి తింటాడనీ చెప్పి వెళ్ళిపోయాడు. అందుచేత పార్వతిని శివుడి కిచ్చి పెళ్ళి చేసే ఆలోచన మానుకున్నాం," అన్నారు.

ఈ మాట విని సప్తమహర్షులు అమితాశ్చర్యం పొంది, "ఆ భిక్షువు ఎవడో దుర్మార్గుడై వుంటాడు. శివపార్వతుల పెళ్ళి చెడగొట్టటానికి మీతో అలా చెప్పి

ఉంటాడు. మీ కుమార్తె ఆ పరదేవత అవతారమని మరవకండి. ఈమె శివుడి భార్య కావటానికే మీ కుమార్తెగా పుట్టింది,'' అన్నారు.

వసిష్ఠమహాముని మేనకా హిమవంతులకు ఈ సందర్భంలో అనరణ్యు డనే రాజు కథ చెప్పాడు.

ఇంద్రసావర్ణి అనే పద్నాలుగో మనువు వంశంలో అనరణ్యుడనే రాజు చక్రవర్తిగా రాజ్యపాలన చేసేవాడు. ఆయనకు రుచి అనే గొప్ప తపశ్శాలి పురోహితుడుగా ఉండేవాడు.

ఆ రాజుకు అయిదుగురు భార్యలూ, నూరుమంది కొడుకులూ, అందరి తరవాత పద్మావతి అనే కుమార్తే ఉండేవారు. పద్మావతి అపురూప సౌందర్యవతి. యౌవనం రాగానే అనరణ్యుడు ఆమెకు తగిన రాజ కుమారుడి కోసం అన్వేషణ ప్రారంభించాడు.

ఇలా వుండగా ఒకనాడు పద్మావతి తన పరిచారికలతో సహా నదికి వెళ్ళి స్నానం చేస్తూండగా, పిప్పలాదుడు అనే మహాముని స్నానం కోసం అక్కడికే వచ్చాడు. పిప్పలాదుడు సామాన్యుడు కాడు, భృగువంశాన పుట్టినవాడు; దధీచి మహాముని కొడుకు.

అటువంటి పిప్పలాదుడు పద్మావతి అందం చూసి మోహించి, అనరణ్యుడి సభకు వెళ్ళి, తనకు పద్మావతిని భార్యగా ఇచ్చి వివాహం చెయ్యమని కోరాడు.

రాజుకు నోట మాట రాలేదు. రతీదేవి లాటి తన కుమార్తెను మన్మథుడి వంటి ఏ రాజకుమారుడికో ఇవ్వాలని ఆయన అనుకుంటూ వుండగా, ఈ ముసలివాడు ఎక్కడి నుంచో ఊడిపడ్డాడు. ''నా కుమార్తెను నీకు భార్యగా ఇవ్వను!'' అంటే శపించి, వంశ నిర్మూలనం చేస్తాడేమో!

ఇలా రాజు సంశయావస్థలో పడి కొట్టుకుంటూ వుండగా, రాజ పురోహితుడూ, మంత్రులూ ఆయనకు ధైర్యం చెప్పి, ఒక సలహా ఇచ్చారు.



# అన్నీ తెలిసినవాడు!

ఒకానొక రాజు దగ్గిర మహా మేధావిగా ఖ్యాతిగాంచిన మంత్రి వుండేవాడు. ఆయన వృద్ధుడై పోయి పదవీవిరమణ చేయదలిచాడు. రాజు ఆయనను పదవీవిరమణకు ముందు కొత్తమంత్రిని ఎంపిక చేయవలసిందిగా కోరాడు.

మంత్రి పదవి కోరుతూ చాలామంది వచ్చారు. వృద్ధ మంత్రి వాళ్ళకు కొన్ని పరీక్షలు పెట్టాడు. వాటన్నిటిలో యిద్దరు యువకులు సర్వశ్రేష్ఠులుగా ఉత్తీర్ణులయ్యారు. అయితే, మంత్రి పదవికి కావలసినవాడు ఒక్కడే!

వృద్ధ మంత్రి వాళ్ళిద్దరినీ తన మందిరానికి ఆహ్వానించాడు. అక్కడ జిలుగు పనులతో తయారు చేసి, బంగారు మలాము అద్దిన ఉన్నతాసనం ఒకటి వున్నది. మంత్రి వాళ్ళకు దాన్ని చూపుతూ, "మీరిద్దరూ అన్ని పరీక్షల్లో సరిసమానంగా గెలుపొందారు. ఇది ఆఖరి పరీక్ష. మీ యిద్దరిలో అన్నీ తెలిసినవాణ్ణనే గట్టినమ్మకం వున్నవాడుపోయి, ఆ ఆసనంలో కూర్చోవాలి. ఇందుకు గడువు మూడు క్షణాలే," అన్నాడు.

ఆ వెంటనే ఒకడుపోయి, ఆసనంలో కూర్చున్నాడు. వృద్ధమంత్రి రెండోవాణ్ణి వెంట పెట్టుకుని రాజు దగ్గిరకుపోయి, అతణ్ణి మంత్రిగా నియమించమని సలహా యిచ్చాడు.

—ఎస్. విశ్వనాథ్





# దొంగా-ఫకీరూ

ఇస్ఫహాన్ నగరంలో, కమలుద్దీన్ అనే వస్త్రాల వ్యాపారి వుండేవాడు. ఒకనాటి చీకటి పడేవేళ, అయన దుకాణం మూసి, ఇంటికి బయలుదేరాడు. అయన చేతిలో, ఆనాటి అమ్మకాల ద్వారా వచ్చిన డబ్బు సంచీ వున్నది.

కమలుద్దీన్ కొంత దూరం రాజ మార్గాన నడిచి, అంతగా జనసంచారం లేని ఒక పక్క వీధిలో ప్రవేశించాడు. హఠాత్తుగా ఒక యువకుడు వెనకవైపు నుంచి వచ్చి, అతడి చేతిలో వున్న డబ్బు సంచీ లాక్కుని పరిగెత్తసాగాడు. కమలుద్దీన్ దొంగ, దొంగ అంటూ కేకలు పెట్టాడు. ఆదారి వెంట వస్తున్న కొందరు పారిపోతున్న యువకుడి వెంటపడి పట్టుకున్నారు.

కమలుద్దీన్‌కు పోయిన డబ్బు దొరికింది. దొంగను పట్టుకున్నవాళ్ళు, వాణ్ణి తిన్నగా కొత్వాలు దగ్గిరకు లాక్కుపోయారు.

ఈ కొత్వాలు పరమకోపిష్ఠి. అతను క్షమించమని దీనంగా వేడుకుంటూ గట్టిగా పాదాలు పట్టుకున్న యువకుణ్ణి, "ఒరే, నీకెన్ని గుండెలు! దుర్మార్గుడా, నేను కొత్వాలుగా వుండగా, నగరంలో దొంగతనమా?" అంటూ గట్టిగా తన్నాడు.

ఆ దెబ్బకు యువకుడు ఎగిరి వీధిలో పడ్డాడు. అయితే, వాడు మరుక్షణంలోనే బంతిలా ఎగిరి అక్కణ్ణించి పరిగెత్త సాగాడు. వాణ్ణి పట్టుకునేందుకు కొందరు భటులు వెంటబడ్డారు. కాని, యువకుడు వాళ్ళకు అందకుండా నగర పరిసరాలు దాటి పారిపోయాడు. అయినా, భటులు వదలక, వాణ్ణి వెంటబడి తరమసాగారు.

అరేబియా కథ

అప్పటికే బాగా అలసిపోయినదొంగకు, దారి పక్కన వున్న ఒక కొండ గుహలో చిన్న దీపపుకాంతి కనబడింది. అందులో ఒక ఫకీరు నివసిస్తున్నాడు. దొంగ చప్పున గుహలోకి వెళ్ళాడు. ఆ సమయంలో ఫకీరు లేడు. దొంగ అక్కడ దొరికిన ఒక దుప్పటి కప్పుకుని, ప్రార్థన చేస్తున్నవాడిలా కూర్చున్నాడు.



కొద్ది క్షణాల్లో భటులు అటు కేసి పరుగెత్తుకు వచ్చి, గుహలోకి తొంగి చూస్తూ, ''అయ్యా, ఇటుగా ఎవరైనా పరిగెత్తుకు రావడం చూశారా?'' అని అడిగారు.

''చూడలేదు!'' అన్నాడు దొంగ గంభీరంగా.

''అయ్యా, క్షమించండి! తమ ప్రార్థనకు అంతరాయం కలిగినట్టున్నది,'' అంటూ భటులు, దొంగకు ప్రణమిల్లి వెళ్ళిపోయారు.

దొంగకు భయం పోయి, మనసు బాగా కుదుటపడింది. భటులు తనకు ప్రణమిల్లడం వాడికి నవ్వు తెప్పించింది. అయితే, ఆ మరుక్షణం వాడి కొక సంశయం కలిగింది: ఫకీరుగా నటించిన మాత్రానే నాకు అపాయం తప్పింది. పైగా, యితరులు నాపట్ల ఎంతో గౌరవం చూపారు. నేను నిజంగానే ఫకీరునైతే, ప్రజలు నన్ను మరెంత భక్తి గౌరవాలతో పూజించగలరో!

దొంగ యిలా ఆలోచిస్తూండగా, ఆ గుహలో నివసిస్తున్న ఫకీరు తిరిగి వచ్చాడు. దొంగ ఆయన పాదాలముందు పడి, ''నేనీ గుహలోనే వుంటూ, తమకు సేవచేసేందుకు అనుమతి యివ్వండి!'' అంటూ వేడుకున్నాడు.

దయాళువైన ఫకీరు అందుకు అంగీకరించి, దొంగను తన శిష్యుడుగా చేసుకున్నాడు.

ఆనాటి నుంచి దొంగ, ఫకీరుకు శుశ్రూషచేస్తూ, ఆయన ధర్మబోధలు వినసాగాడు. క్రమంగా వాడిలో హృదయ

పరివర్తన కలిగింది. వాడు సజ్జనుడుగా, ధార్మికుడుగా మారిపోయాడు.

కొన్నేళ్ళు గడిచినై. ఫకీరు కాల ధర్మం చెందాడు. దొంగ గొప్ప ధర్మ బోధకుడుగా కీర్తి గడించాడు.

ఒక రోజున, శిష్యుడి కోరికను మన్నించి దొంగ నగరానికి వెళ్ళాడు. అక్కడ అనేకమంది ప్రజలు వాడికి స్వాగతం యిచ్చి, తమకు ఎదురైన ధర్మసందేహా లను వివరించారు. దొంగ వారి, వారి సందేహాలకు ఉచిత రీతిలో సమాధానా లిచ్చి తృప్తిపరిచాడు.

ఆ సమయంలో ఒక ముసలివాడు, దొంగను సమీపించి, అమిత భక్తితో వాడి పాదాలు తాకి, ''సాధుసత్తమా, నాబోటి వాడు దైవసాన్నిధ్యాన్ని చేరడమంటే, ఏదైనా మహాద్భుతం జరిగితీరాలి. కారణం, నేను మీ లాగా కాక జీవితాన్ని మరొక రకంగా గడిపినవాణ్ణి. ఎంతో కాలం, యీ నగరానికి కొత్వాలుగా వున్నాను,'' అన్నాడు.

''నాయనా, అద్భుతాలు జరగవని ఎందుకు శంకిస్తున్నావు? ఒకానొకనాడు, నేను నీ పాదాలు తాకాను. కాని, ఆ సమ యంలో నువ్వు, నన్ను కోపంతో గట్టిగా తన్నావు. అయినా ఈనాడు ఎంతో భక్తితో నువ్వు, నా పాదాలు తాకావు. ఇది అద్భుతం కాక మరేమిటి? ఒకనాటి దొంగ దేవుడి కరుణకు పాత్రుడు కాగలిగి నప్పుడు, దొంగలను పట్టి బంధించే కొత్వాలు కూడా ఆయన కరుణకు ఎందుకు పాత్రుడు కాడు?'' అంటూ దొంగ ముసలివాడి కేసి ఆప్యాయంగా చిన్నగా నవ్వాడు.

ఈ జవాబు ముసలివాడికి అర్థం కాలేదు. అప్పుడు దొంగ, అతడికి చాలా ఏళ్ళక్రితం జరిగిన సంఘటన వివరించి చెప్పాడు.

అప్పుడు ముసలివాడు పట్టరాని ఆనం దంతో వాడి పాదాలు గట్టిగా పట్టుకున్నాడు. అతడి కన్నీటితో దొంగ పాదాలు తడిసి పోయినై.



పక్షులు – జంతువులు :

# నాలుగు కాళ్ల 'చేపలు'

**1741** వ సంవత్సరంలో రష్యాకు చెందిన సెయింట్ పీటర్ అనే ఓడ బేరింగ్ ద్వీప తీరంలో పగిలిపోయింది. ఆ ఓడనుంచి ప్రాణాలతో బయటపడిన కొందరు ఈదుకుంటూ బేరింగ్ ద్వీపం చేరారు. అలా వాళ్ళు ఈదుతున్నప్పుడు, 'సీ ఆటర్స్' అనే స్తన జల జంతువులు అసంఖ్యాకంగా ఉండడం చూశారు. రష్యా ప్రయాణీకులు ఆ ద్వీపంలో ఉన్నన్నాళ్లూ, తమ ఆహారం కోసం, గుడారాలు నిర్మించడానికి చర్మాలకోసం అక్కడి 'ఆటర్స్'ను చంపసాగారు. అక్కడినుంచి వాటి చర్మాలను తీసుకెళ్ళి మంచి ధరలకు అమ్ముకున్నారు. ఆనాటి నుంచి సముద్రాల మీద ఈ జంతువుల వేట ఎక్కువయింది. దాని కారణంగా ఒకప్పుడు పసిఫిక్ సముద్ర తీరంలో విరివిగా కనిపించే ఈ జంతువులు క్రమంగా నశించిపోసాగాయి. 1910 సం॥ అమెరికా, 1915 వ సంవత్సరంలో మరికొన్ని దేశాలూ ఈ జలజంతు సంతతిని రక్షించడానికి—వీటి వేటను నిషేధిస్తూ శాసనాలు చేశాయి.

సముద్రపు పాచి దట్టంగా ఉండే, లోతులేని ప్రాంతాలలో ఈ జలజంతువులు గుంపులు గుంపులుగా నివసిస్తాయి. ముప్పావు మీటరు తోకతో, ఒక మీటరు పొడవుతో ఉంటుందీ జంతువు. పెద్ద తల, పొట్టి మెడ, చిన్న కళ్ళూ, చెవులూ, గుబురు మీసాలతో ఉండే ఈ జంతువుల ముందు కాళ్ళు, వెనక కాళ్ళ కన్నా పొట్టివి. వేళ్ళను కలుపుతూ, చర్మం ఉంటుంది.

నీళ్ళపై వెల్లకిలా పడుకుని, కొట్టుకుపోకుండా ఒంటికి సముద్రపు పాచిని చుట్టుకుని గుంపులు గుంపులుగా నిద్రిస్తాయి. ఆ సమయంలో ఒక జంతువు మాత్రం కాపలా కాస్తూ ఉంటుంది. నిద్ర లేవగానే సముద్రంలో మునిగి—పీతలను, గుల్ల చేపలను పట్టి తింటాయి. ఇవి గుల్ల చేపల మీది పై గుల్లను పగలగొట్టడానికి సముద్రం అడుగు నుంచే రాయిని తెచ్చుకుని—కింది కాళ్ళతో రాయిని పట్టుకుని చేతులతో గుల్లను పగులకొట్టి తింటాయి. రెండేళ్ళకు ఒకసారి మాత్రమే ఈతకు వచ్చే ఈ జల జంతువులు—ఈనడానికి మాత్రం నేల మీదికి వస్తాయి. శాంతియుత సహజీవనానికి అలవాటుపడిన ఈ జలజంతువులు కొన్ని విషయాల్లో మనుషుల్లాగే ప్రవర్తిస్తాయి.



# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1985 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మే నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: అతని బతుకు ఈతచెట్టు　　రెండవ ఫోటో: నా బతుకు చేనుగట్టు

పంపినవారు: శ్రీమతి కటారి మల్లీశ్వరి, తిరుపతి-517 501

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

## మీకు తెలుసా? సమాధానాలు

1. జాన్ బార్డీన్ 2. ఫ్రెడెరిక్ శాంగెర్ 3. నికొలాయ్ సెమినోవ్ 4. ఎవోగాడ్రో
5. ఫేరడే గురువైన హంఫ్రీడేవీ.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

లే మజా గోల్డ్ స్పాట్ మజా




cially flavoured. Contains no fruit juice or fruit pulp.

**serve chilled**




rikaya-GS-2-83-TEL

67

ఒక మొటిమ వచ్చిందంటే చాలు దాంతో మరొకటి
అందుకే మీకు కావాలి ప్రత్యేక చర్యగల కొత్త, ఎక్కువ ప్రభావం గల క్లియరసిల్.

# కొత్త, ఎక్కువ ప్రభావం గల క్లియరసిల్ మొటిమల్ని పోగొడుతుంది దాంతో బాటే యిక వాటిని పాకకుండా చేస్తుంది

ఏంటీ-బేక్టీరియల్ ట్రయ్‌క్లోసిన్ గలది



పెరిగే వయసులో మొటిమలు రావడం సహజం. మీకు యవ్వనం అంకురిస్తూన్న దశలో, అవి వచ్చి, పోతూవుంటాయి. అయితే వాటిని గురించి అసలు పట్టించుకోకపోయినా లేదా వాటిని గూర్చి తెగ బాధపడి పోయినా అవి అలా మాయమైపోవు యిక. మరి మోటుగా, గోళ్ళతో నొక్కి చిదిపి పారేస్తేనూ లాభం లేదిక. పైగా దానివల్ల జరిగేదేమిటంటే అది అంటువ్యాధై పెరిగి, పాకి, ముఖంపైన మరిన్ని మొటిమలు తయారవుతాయి దాంతో.

**ట్రయ్‌క్లోసిన్ గల కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్, అత్యంత ప్రభావంతో ఎలా పనిచేస్తుందో చూడండిక:**

కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్, మొటిమల్ని పోగొట్టడమే కాకుండా, వాటిని పాకకుండా చేస్తుందిక. ఎందుకంటే, దీన్లో ప్రత్యేకమైన 'ఏంటీ-బేక్టీరియల్' ఔషధం ఉంది గనక, ట్రయ్‌క్లోసెన్ గల కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్, మొటిమలను కలుగజేసే బేక్టీరియాను పెరగకుండా ఆపు చేస్తుంది. అంతేగాకుండా మిగతా చర్మానికి అంటువ్యాధి సోకకుండా కాపాడుతుంది. మరి అందుకే మీ మొటిమలిక పాకవు.

**కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్‌తో అత్యుత్తమ ఫలితాలను పొందే విధానం**

మొట్టమొదటగా, మీ ముఖాన్ని కడుక్కోండి. ఆ తర్వాత మీ ముఖం అంతటిపైనా కొత్త, ఎక్కువ ప్రభావం క్లియరసిల్ రాసుకోండి. మొటిమలున్నచోట మరింత ఎక్కువగా రాసుకోండి. అత్యుత్తమ ఫలితాల కోసం, కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్‌ని క్రమం తప్పకుండా ప్రతిరోజూ, రోజుకు రెండుసార్లు చొప్పున, ఉదయమూ, రాత్రి కూడా కొంతకాలం పాటు వాడుతూ ఉండాలి.

**ట్రయ్‌క్లోసెన్ గల కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్‌లోని అద్వితీయమైన 3-విధాల చర్య**



**మొటిమలను తెరుస్తుంది**
క్రీంలోని ప్రత్యేకమైన ఔషధాలు మొటిమలపైని పొక్కుల్ని తెరుస్తాయి.



**బేక్టీరియాను ఎదుర్కొంటుంది**
కొత్త ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్‌లోని ఏంటీ-బేక్టీరియల్, ట్రయ్‌క్లోసెన్, మొటిమలు తెరిచి, వాటిని పాకేలా చేసే బేక్టీరియాను ఎదుర్కొంటుంది.



**మొటిమలను ఆరబెడుతుంది**
అధికంగా ఉండే నూనెను పీల్చి, మొటిమల్ని ఆరబెడుతుంది.

కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్ ముఖంపై గల నల్లపొక్కుల్ని మెత్తబరిచి వాటిని ఊడేలా చెయ్యగలదు కూడాను.




క్లియరసిల్ వేనిషింగ్ మెడికేషన్ కూడా దొరుకుతుంది.

OBM/3556 TEL

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

ప్రవేశ రుసుము లేదు



# చందమామ కేమెల్ రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**

**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పోస్ట్ బాక్స్ నం. 11501, నారిమన్ పాయింట్ పోస్ట్ ఆఫీస్, బొంబాయి 400 021.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి పత్ర వ్యవహారాలు జరుపబడవు.

Name:.............................................. Age:..................

Address:..............................................

..............................................

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: 31.5.1985

**CONTEST NO.42**

Vision/CPL/85015 Tel.

# పుప్పి పళ్లను కనుగొన్నాడు మా బాబు ఒకనాడు!






















## ఫోర్‌హెన్స్ ఫ్లోరైడ్

రుచికరమైన మరియు నురుగునిచ్చే టూత్‌పేస్టు
మీ పళ్లను మరియు చిగుళ్లను రెండిటినీ రక్షిస్తుంది.




331 F 183 TEL

# మాల్టోవా ముఠా వెళ్లొచ్చారు కొండల్లోకి షికారు.

ఆహాహా. ఈసారి సెలవులు ఎంత మజాగా మొదలయ్యాయో! ముఠా మొత్తం బొంబాయికి దగ్గర్లోని కర్నాలా కోట ఎక్కరావాలని తీర్మానించుకున్నారు. రాబూ, మాలతీల పని పిక్నిక్ భోజనాల ఏర్పాట్లు చూడడం. వెంటకి శాండ్‌విచ్‌లూ, ఆపిల్సూ, బిస్కట్లూ... అన్నీ అలాఉంచి తయారుగా తృప్తిగా ఓ పెద్ద మాల్టోవా ఫ్లాస్కు!

**మిన్నీ తప్పిపోతుంది...**

ముఠా మొత్తం పొద్దుపొడవగానే బయల్దేరారు. టిఫిను వేళకల్లా కర్నాలా బర్డ్ శాంక్చువరీకి చేరుకున్నారు. గబగబా ఓకప్పు మాల్టోవా తాగి ఇక లేచారు. లేవడమేమిటి ఉత్సాహంగా ముందుకు నడిచారు. చిట్టి మిన్నీ పరుగు పరుగున దూసుకెళ్లింది. అంతే, క్షణంలో తప్పిపోయింది. అందరూ ఒకే దిగులు పడిపోయారు పాపం. అంతా చీకటయిపోయి నట్టయింది. ఇంతలో ఉన్నట్టుండి మాయవేషంలో ఆ ఏనుగు ఎదురొచ్చింది.

జట్టంతా చెదిరిపోయి దిగాలు పడిపోయిన మిన్నీని అది వెంటబెట్టుకొచ్చింది, అడవి పూలు కోసుకొద్దామని అలా ముందుకెళ్లిందిట, దారి తప్పిపోయిందిట. "ఇదిగో మిన్నీ, ఈ సారేదైనా ఇలాటి చిలిపి పని చేశావంటే మళ్లీ నిన్ను పిక్నిక్‌కు పిల్చుకొచ్చేది లేదు. ఆఁ" అంటూ రాబూ అరిచాడు. "పోనీలే పాపం. బుద్ధొచ్చి ఉంటుంది. పదండి పదండి" అంటూ కదిలారు వేణు, నదీం ఇద్దరూనూ.

**అబ్బ, ఏం మజా వచ్చిందో ఆరోజు**

ముఠా మొత్తం కోటలో పిక్నిక్ ఆనందంగా జరుపుకున్నారు. కాస్సేపు దాగుడు మూతలూ అవీ ఆడుకోగానే ఇంటి ముఖం పట్టడానికి వేళయింది. అయినా అలసటైనది తీసుకోకుండా వెనక్కి బయల్దేరితే ఎలా! అదే, అందరికీ ఒక్కొక్క పెద్ద కప్పుడు మాల్టోవా! "ఇకనుంచీ నాతోనే ఉండు మిన్నీ. మళ్లీ మాయమయ్యేవు." అన్నారు రాబూ. ఆ తర్వాత హాయిగా పాడుతూ గెంతుతూ అందరూ కొండదిగి వచ్చారు.

**అదే మరి, మాల్టోవా మహత్యం**

అవును, మాల్టోవా తాగే పిల్లలు జీవితంలో ఆనందాన్ని సంపూర్తిగా జుర్రుకుంటారు. ఎందుకంటే ఒక్కొక్క కప్పు మాల్టోవాలో బంగారమంటి గోధుమలు, బార్లీ, శుద్ధమైన పాలు, సమృద్ధియైన కోకో, చక్కెరల మంచితనం నిండుగా ఉంది. వీటితో మంచి నిరోధక శక్తి, బలము, దమ్ము వస్తాయి. మీ పిల్లలకు మాల్టోవా ఇవ్వండి. వాళ్లు బలంగా, ఆరోగ్యంగా పెరగడం చూసి ఆనందించండి. మాల్టోవా మీ పిల్లలకు జీవితంలో ఉరకల ఉత్సాహాన్నిస్తుంది.

**మాల్టోవా క్లబ్‌లో చేరండి**

ఎంతో సులభం.
మూడు 500 గ్రా. కార్టన్-లేబిళ్లు,
లోపలి సీళ్లు లేదా మూడు 500 గ్రా. రీఫిల్
ప్యాకుల పైని ఫ్లాపులు ఈ చిరునామాకు
పంపారంటే చాలు:

ది మాల్టోవా క్లబ్,
4వ ఫ్లోరు, భండారీ హౌస్, 91 నెహ్రూ ప్లేస్,
న్యూ ఢిల్లీ 110019.

మీరిక చేరిపోయినట్టే!




JIL జగత్‌జీత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్

**విటమిన్‌లతో నిండిన మాల్టోవా: ఆరోగ్యం, బలం మరియు శక్తికోసం**

SIMOES/JIL/001/84 TEL